

''బంగారు కలలు'' చిత్రంలో నాగేశ్వరరావు, లక్ష్మి

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!

## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

చదువుల్లో ఆటల్లో రాణింపు అయే శక్తిని
పిల్లలకు తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక
శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది.
ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన
పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది.
పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు
పంచదారలతో తయారైన
బోర్న్‌విటా రుచికరమైనది.




**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**






# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 22–3–1974
శ్రీ ప్రమాదినామ సం. ఫాల్గుణమాస బ. చతుర్థి.
సంపుటము : 67 సంచిక : 30

స్థాపితం · 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3

విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హిందీనటి బిందు
(ఫొటో : ఇ. వి. ఆర్. మోహన్)

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

అక్రమ నిల్వలు చేసే వారికి
అక్రమ లాభాలని ఆర్జించే వారికి
రాష్ట్రపతి హెచ్చరికలు






చెడు రోజులు వచ్చాయి!










విచారించాల్సిన విషయం








# మరో మరో తెలుగోడి గోడు

మహారాష్ట్రలో మహారాష్ట్రులకి ఉద్యోగావకాశాలు సన్నగిల్లి పోతున్నాయని మహారాష్ట్రని 'దోచుకుంటోన్న' దక్షిణాది వారి మీద బాల థాకరే గారి శివసేన దండయాత్ర ప్రారంభించింది. పొట్టచేతబట్టుకుని ఉద్యోగాలు వెదుక్కుంటూ బొంబాయి మహానగరానికి నాలుగు దక్షిణ రాష్ట్రాల నుంచి అనాదిగా ఎందరో చేరుకుంటున్నారు. కేరళ ప్రాంతానికి చెందిన వారు పెక్కుమంది బొంబాయి పరిశ్రమలలో చిన్న చిన్న ఉద్యోగాలయినా సంపాదించు కుంటున్నారు. తమిళనాడుకి చెందిన వారు పరిశ్రమలలో కీలక స్థానాలు ఆక్రమిస్తున్నారు. మైసూర్‌కి చెందిన వారు ఉడిపి హోటళ్లు స్థాపించి వ్యాపారం చేస్తున్నారు. ఆంధ్రులు తరతరాలుగా మహారాష్ట్రలో స్థిరపడిన వారూ వున్నారు, మామూలుగా ఉపాధికోసం బొంబాయిలో అడుగు పెట్టిన వారూ వున్నారు. కేరళీయులతో ప్రారంభమయి, కన్నడిగుల మీదుగా తమిళుల పైకి బాలథాకరే గారి దండయాత్ర సాగింది. ఇక ఆఖరి ఘట్టంలో ఆంధ్రులకి ఈ 'సత్కారం' జరుగుతుంది. అప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మహారాష్ట్ర ప్రభుత్వానికి తమ నిరసన తెలుపుతుంది, కాని తమ రాష్ట్రంలో పరిస్థితుల గురించి ఆలోచించదు.

మహారాష్ట్రలో జాతీయ సమైక్యతకి సమాధి కట్టుతున్నారని, ప్రాంతీయ దురభిమానాన్ని పాలుపోసి పెంచుతున్నారనీ అభిప్రాయపడేవారు, వారు తెలుగువారు అయితే ఒక విషయం గుండెలమీద చేతులు వేసుకుని ఆలోచించడము మంచిది.

1969 లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం పేరున జరిగినది నిజానికి ఆంధ్ర వ్యతిరేకోద్యమం. హైదరాబాద్ అనే సమగ్ర ఆంధ్రప్రదేశ్ రాజధానిలో ఆంధ్రుల ప్రాణాలను, ఆస్తులను రక్షించడానికి సి. ఆర్. పి. దళాలు కావాలసి వచ్చింది. సొంతకొంపలో ఆంధ్రుడికి దిక్కు లేక పోయింది.

ఇప్పుడు మహారాష్ట్రలో మహారాష్ట్రులు ఏవిధమయిన కష్టాలు అనుభవిస్తోన్నా అవి ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్రులు అనుభవిస్తోన్న కష్టాలకన్నా గొప్పవికావు! మహారాష్ట్ర మహారాష్ట్రులకేనని బాలథాకరే గారు అంటారు. కాని ఆంధ్ర రాజధానిలో ఏ ఆంధ్రుడయినా ఉడుకు రక్తంతోనూ, ఆంధ్ర పౌరుషంతోను 'ఆంధ్రప్రదేశ్ ఆంధ్రులకే' అంటే అతనిని 'నాన్–ముల్కీ' అంటారు!

ముల్కీ నిబంధనలకు వ్యతిరేకంగానూ, పదహారు సంవత్సరాలుగా 'తమ రాష్ట్రం'లో రెండవ తరగతి పౌరులుగా బ్రతికిన బాధతోను ఆంధ్రులు 1972 లో జరిగిన ప్రత్యేక రాష్ట్రోద్యమం ఆరు సూత్రాల పథకానికి దారితీసి 21 ఎమ్మెల్యేలను సృష్టించిన ఘట్టం జాతీయ సమైక్యతకే కాక రాష్ట్ర సమగ్రతకే గొడ్డలిపెట్టు! మహారాష్ట్రలో మహారాష్ట్రేతరులకి రాను రాను ఉద్యోగావకాశాలు దుర్లభమవవచ్చు. కాని మహారాష్ట్రలో మహారాష్ట్రులు వుంటారు. కాని ఆంధ్రప్రదేశ్‌లో ఒక జిల్లావాడు ఇంకొక జిల్లాలో 'నాన్–ముల్కీ' అయిపోతున్నాడు. తూర్పు గోదావరి జిల్లావాడు పశ్చిమ గోదావరి జిల్లా వాడిని 'గౌజాక్' (ఇంగ్లీషులోనే) అంటాడు (గోదావరి మీద రైలు–రోడ్ బ్రిడ్జి పూర్తవుతోంది ఫరవాలేదు) 'విభజించి పాలించు' అనే ఇంగ్లీషువాడి రాజకీయ సూత్రం తెలుగునాట ఇంగ్లీషువాడు భారతదేశాన్ని పాలించిన దానికి చిహ్నంగా మిగిలిపోయింది. మహారాష్ట్రలో దక్షిణ ప్రాంతీయులకి అన్యాయం జరుగుతోందని బాధపడేవారు ఆంధ్రప్రదేశ్ లోనే ఆంధ్రుల దయనీయమయిన స్థితిని అర్థం చేసుకుంటే బాగుంటుంది.

—తాజీ ప్రసాద్

## హైదరాబాద్ నోట్‌బుక్

**త మ సో మా**

విద్యుచ్ఛక్తిని పొదుపు చేయడం అవసరమే సుఖసౌకర్యాలనే సాకుతో విద్యుత్తును దుర్వ్యయం చేసుకోకుండా జాత్యభ్యుదయం కోసం వినియోగించడం ఎవరూ కాదనరు. కాని, విద్యుచ్ఛాఖవారు తమకు తోచినప్పుడు, తీరిక వున్నప్పుడు, తమ అవసరాలు తీరినప్పుడు లైట్లు ఆర్పివేస్తున్నారా? అని అనుమానం కలుగుతోంది, వేళాపాళా లేకుండా దీపాలు ఆరిపోవడం చూచి. పొద్దుగూకగానే దీపాలు ఆరిపోయినా, భోజన సమయంలో ఆరిపోయినా, పూజాసమయంలో ఆరిపోయినా అశుభం అనుకుంటారు ప్రాచీన సంప్రదాయానుగాములు. కాని ఇప్పుడు ఏం చేస్తాం? అశుభమనేదేమీలేదు, ఇప్పుడు, సూర్యోదయ సూర్యాస్తమయాలలో కాక, లైట్లు అవసరంలేని సమయాలలో విద్యుత్తును బంద్‌చేయరాదా అధికారులు.

**దొరికిన విగ్రహం :**

ఇటీవల విగ్రహాపకరణం వృత్తి అయిపోయింది. పిన్నలు, పెద్దలు దీనికి దిగుతున్నారు. విగ్రహం అపహరించడం, ప్రాచీన మనిపించేట్టు చేయడం, విదేశీయులకు అంటగట్టడం— ఇదీవరుస. కాని, మన రాజధాని పోలీసుల అప్రమత్తతవల్ల అంతర్రాష్ట్రాల విగ్రహాపహర్తలూ పట్టుబడిపోతున్నారు, మనం నిజంగా గర్వించదగిన సంగతి. బీదర్ జిల్లాలోని ఒక జైన దేవాలయంలో అపహృతమైన 18 అంగుళాల ఒక ఇత్తడి తీర్థంకర విగ్రహం ఉస్మాన్ బజారువద్ద శ్రీ ఇ. సత్యనారాయణ (డిటెక్టివ్ శాఖ) ఒక వ్యక్తి నుండి పట్టుకున్నారు. ఇలాంటి అపూర్వ కళా సంపద విదేశాలకు వెళ్లడం, వారు ఏవో పుస్తకాలు వ్రాసి భారతీయ సంస్కృతికి మసిపూయడం జరుగకుండా పోలీసుశాఖ మరింత జాగరూకతతో వుండడం అవసరం.

**అబ్బ ! ఇప్పటికి !**

నగరంలో పెద్ద కూరగాయల మండీ అయిన మీర్ ఆలం మండి వానాకాలంగానే నరకంవలె కనిపిస్తుంది. వానాకాలంలో యముని మహిషం లోతు పాదాలతో తొక్కిన నరకంవలె వుంటుంది. గుంటలు, గతుకులు, ఒకతీరులేదు, తెన్నులేదు. డాక్టర్ నాయని కృష్ణకుమారిగారు తమ కథలో ఎంత సహజంగా వర్ణించారా అనిపించింది. ఇలాంటి— పిసం విధగుణ గరిష్ఠమైన — మండీలో సిమెంటు రోడ్లు పడాలని కూరగాయల వర్తకుల సంఘం అధ్యక్షుడు ఇటీవల పత్రికా ప్రకటన చేయడం ఎంతో హర్షించవలసిన విషయం. మార్కెటింగ్ శాఖవారు ఈ విషయంలో ఎంతత్వరగా చర్య తీసుకుంటే— అంత త్వరగా నగరవాసులకు, వ్యాపారులకు సౌకర్యాలు కలుగుతాయి.

**ఉ ప శ్రు తి :**

ప్రాణం పోకడ వానరాకడ ఎవరికి తెలుసు? పాతసామెత. లైట్లు పోకడ, లైట్లురాకడ ఎవరికి తెలుసు? —కొత్తసామెత.

—తిరుమల రామచంద్ర

'కీలుగుర్రం' అంటే తెలియనివారికి ? —

సైకిల్ – రెండు చక్రాల ఉక్కుచక్రం — మీదస్వారీ ఈమధ్య — యుద్ధం వచ్చిన తర్వాత ... మోటారు కారులున్న ఆసాములకీ, స్కూటరులున్న స్వాములకీ కూడా గొప్ప అవసరమైపోయింది.

ఈమధ్య సైకిల్ని గొప్పవాళ్ళు కూడా తెగ మెచ్చుకుంటున్నారు. పెట్రోలు "కంపు" చెవులు చెడేలా హోరు చేయదు — 'ఆయిల్' అడగదు ..పది పైసల ఖర్చుతో పాతికమైళ్ళ 'తిరిగినా' – 'పంక్చర్' తప్ప పెద్ద 'రిపేర్'లు రావుకదా !...

కాకపోతే "పోలీసాయన" సైకిల్ మీదున్నది మిలియనీర్ అయినా "అప్పే! కేర్" చేయాడు ఒక్కసారి దబాయించేస్తాడు... అదే చప్పుడే చేసే మోటార్ సైకిలైతేనా ?

కాని సైకిల్ చాలామంచిది. ఆరోగ్యానికి మంచిది.. ఆనందానికి. ..పొదుపుకి....గట్రా మరీ మంచిది— ట! అని ఇంగ్లాండులో కూడా అనుకుంటున్నారు ! మోటార్ కార్లొచ్చాకా సైకిల్లకు అసలు గిరాకే లేకుండాపోయిన 'బ్రిటన్'లోనే ఈ మధ్య జనం నాలుగు చక్రాలొదిలి రెండు చక్రాల స్వారీలోనే 'అది' 'ఇదీ' 'అంత' 'ఇంతా' మేలున్నదంటూ ఎగబడుతున్నారుట !

అసలు సైకిల్ కథ— కమ్మని కథ. సర్ ఫ్రాంక్ బోడెన్ అనే వణిక ప్రముఖుడు ఇంగ్లండులో నాలుగు డబ్బులార్జించుకుని, "హాంగ్‌కాంగ్"కి దొరలభావతో 'రామా కృష్ణా' అనుకుందికి ఏమంటారో — అందుకు అని— రిటైరై వెళ్ళిపోయాడట ! కాని మంచానపడ్డాడు. వైద్యులుంగారు "అయ్యా! మీరు ఆర్నెళ్ళ తరువాత స్వర్గంలో అడుగెట్టక తప్పదు" అన్నాడట

ఫ్రాంక్ బోడెన్‌గారు అంతిమశ్వాస పుట్టిన గడ్డమీద తీసుకుందామని తిరిగి ఇంగ్లండొచ్చేశాడు ! కాని డాక్టర్ "సలహా"లు అనుసరించి వో చిన్ని సైకిల్‌మీద రోజూ "తిరగటం' అనే వ్యాయామం చేశాట్ట— "ఆయాసం" మారింది ఆవగా ఆర్నెళ్ళు వెళ్ళాయి. ఆయన అలాగే హరీమనకుండా, సైకిల్ స్వారీ చేస్తూనేవున్నాట్ట. వెంటనే 'ఫ్రాంక్' గారు ఈ సైకిల్ అను కీలుగుర్రం చేసిందెవరు ? అంటూ వెతుక్కుంటూపోయి ఇంగ్లండ్‌లోనే 'నాటింగ్‌హామ్'అనే వూర్లో 'ర్యాలీ'(రాళ్ళీ)వీధి(రాలీ స్ట్రీట్ అన్నమాట !)లో వో చిన్న దుకాణంవాళ్ళు ఈ కీలుగుర్రాన్ని— గుర్రాళ్ళుగట్రా అవసరంలేని, ఆరోగ్యప్రదాయిని అయిన ద్విచక్ర శకటాన్ని తయారు చేశారని తెలుసుకున్నాడు— అంతే—ట దుకాణం అంతా కొనేశాడు ఫ్రాంక్‌గారు— ర్యాలీ సైకిళ్ళ కంపెనీ కట్టాడు— 10 సంవత్సరాలు [illegible] పీడకుండా బతికి ప్రపంచంలో పెద్దదైన ర్యాలీ సైకిళ్ళ కర్మాగారానికి అధినేత అయిపోయాడు !

ఇది ఇలా వుంచండి. సినిమా స్టార్ల సంగతి

చూద్దాం... జబ్బుపడి కోలుకుంటున్న వాళ్లకి సైకిల్ మీద(''లైటు''న్నా లేకపోయినా లైట్‌గా డబుల్స్ కాకుండా) స్వారీ తొందరగా బలం ఇస్తుందన్న మాట— శ్రీ 'పీటర్ సెల్లర్స్' విషయంలో రుజువయింది. గుండెపోటు వచ్చి ఎలాగో బ్రతికి యిట పడ్డ ఆయన్ని వైద్యులు డ్రైవర్ లేకుండా సైకిల్ తొక్కమన్నారుట !

సంపన్నదేశాల్లో— రోల్స్‌రాయ్‌స్ కార్లున్న వారు




కూడా అలా ఎవరూ చూడకుండా వూరవతల తోటల వేపు వెళ్లి— ''కారు'' చెట్లచాటున దాచేసి — డిక్కీలోనుంచి చిన్న సైకిల్ తీసి— దానిమీదెక్కి తుర్రున తోటల్లోకి పారిపోయి రహస్యంగా సైకిల్ త్రొక్కి— తమ ఆరోగ్యాన్ని కాపాడేసుకుంటున్నట్లు విలేఖరులు కొందరు కొట్టిన ''స్కూప్''వల్ల వెల్లడైందని తెలియవచ్చెను !

—సరే మన దేశంలో మాత్రం— సైకిల్ మామూలు మనిషికి బెస్టు ఫ్రెండు కదండీ!— ఎటొచ్చి— దాన్ని తాళం వేసుకుండ ఎక్కడైనా పెడితే కొట్టేస్తారు — తప్పు దాంటవెళ్తే పోలీసు . అన్నట్లు పైన చెప్పుకున్నాంగా యీ సంగతి....

—అధికారికంగా దొరికిన లెక్కలిలా వున్నాయి — 1973—74 కి ''భారత్'' అనగా ''ఇండియా''లో 32,00,000— సైకిళ్ల అవసరం వుంటుందని అంచనా. నాల్గవ ప్రణాళిక లక్ష్యం 36 ప్రక్కన ఐదుసున్నాలు కాని 32 ప్రక్క ఐదు సున్నాలే ఉత్పత్తి సాధ్యమట! ఓ 'డజను' ఫ్యాక్టరీలున్నాయి. మరికొన్ని రావాలి. అవి వస్తే గిస్తే 40,34,000 సైకిళ్లు తయారు అవుతాయి— గిరాకీ పెరిగిపోయే సరుకుల లిస్ట్‌లో సైకిళ్లున్నాయి! 1967 లో 16,94,260. 1968లో 19,52,176. 1969 లో 19,28,888. 1970 లో 20,94,168 1971 లో 18,17,122 (ఏం చెప్మా? 'ఫిగర్'ఇలా చిక్కిపోయిందీ?) సైకిళ్లను మనదేశం తయారుచేసింది. '72 లో 22,73,214 సైకిళ్లను చేయగా 74కి పైన చెప్పినే, 32,00,000 — అంతటి డిమాండ్ కలిగిందన్నమాట !

మరో గొప్ప సంగతి ఏమిటీ అంటే అరేబియా దేశాలు గుర్రాలు ఎగుమతి చేస్తున్నాయో లేదో తెలీదుగాని, మనదేశం యీ కీలుగుర్రాల్ని ఎగుమతి కూడా చేస్తున్నది. కోటి తొమ్మిది లక్షల అరవై ఒక్క వేల రూపాయల విలువైన సైకిళ్లని 1968లో ఎగుమతిచేసిన మనదేశం అలా ఆ విలువని పెంచుతూ వచ్చి 1971—72 నాటికి 183.68 లక్షల (183 తరువాత చుక్కవుంది బాబోయ్!) రూపాయల విలువైన సైకిళ్లను ఎగుమతి చేసింది (లాంబ్రెట్టాలు స్కూటర్లు అవి దిగుమతిచేసే వుండాలి మరి)

అంతేనా ? విదేశీ డబ్బుతో కాని ''షేరులలో'' కాని ''సైకిళ్ల ఇండస్ట్రీ'' పెరగరాదు అని కూడా ప్రభుత్వం శాసించింది — 'దిగుమతి'ని నిషేధించింది. ధరల విషయంలో స్వచ్ఛందంగా అదుపు చేయమని సైకిళ్ల కంపెనీలను ఆదేశించటమేగాక— 1963 జూలైలో వున్న ధరల దగ్గర— 'పూర్తిగా తయారైన సైకిల్'' యొక్క ధరను ''బిగించి'' వుంచేయాలని కోరింది— కాకపోతే విడిభాగాల ధరలు ఎవరిష్టం వారిది— ''అయ్యా! గవర్నమెంటువారూ! స్టీలు ధర విపరీతంగా ఎక్కుతోంది— కావున మేం విడిభాగాల ధర పెంచేస్తున్నాం'' అని ఓ ముక్క గవర్నమెంట్ చెవినవేస్తే చాలుట —

## అసలు సైకిలు గాథ

1520 ప్రాంతంలోనే సైకిళ్లలాంటి ఆకారాలున్న కీలుగుర్రాలేవో వున్నాయంటారుట. కాని 'దాఖలా'' లేదుట 18వ శతాబ్దాంతానికి, ఆహా! ఫ్రాన్స్, జర్మనీలో యీ ధూమ రహిత ద్విచక్ర శకటాలు విరివిగా వుండేవిట. ఒక మాక్మిలన్ అను స్వర్ణకారుడు 1820 లో 'సైకిల్' యంత్రం కనిపెట్టాడు. కాని 1842 దాకా సైకిల్‌తో మనుష్యుల్ని త్రొక్కేసిన నేరం లేదు. మొదటిసారి యీ సైకిల్ సృష్టికర్త అయిన మాక్మిలన్‌గారే ఓ పసిబిడ్డను సైకిల్‌తో ముట్టేసి 5 షిల్లింగుల జుల్మానా కట్టాడుట ! అది రికార్డు ! ఆ తరువాత బ్రిటన్‌లో సైకిల్ శకంలాంటిది గడచింది— చాలా 'పిచ్చిగా' చేసే వాళ్లు సైకిళ్లు వాళ్లు. ఎగుమతులు అవీ సరిగాయి— కాని ఏక్సిడెంట్లు అంతలేవుట.

అదంతా చాలా పెద్ద కథ. ప్రస్తుత గాథ ఏమిటీ అంటే ''అప్పుయిచేసి'' ఆరేళ్ళు తిరగక్కరలేకుండా, లభించే సైకిల్ అనే ''కీలుగుర్రం'' రూపాయిల గుగ్గిళ్లు తినకుండా యజమానికి (ఆయనగారు ఏ కర్మాగారంలో బానిస అయిననూ) ఆరోగ్యమూ, ఆనందమూ— ఇస్తుందని— శరీరంలో రక్తం సరిగ్గా ప్రవహించటానికి, కీళ్ళు సాగటానికి ''సైక్లింగ్'' మందు లట— అంటున్నారు ! కావున సగటుమనిషి సైకిల్‌ని చులకనగా చూ[illegible] ? అని అర్థం.''

# బంగారుకలలు

సీరియల్

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"ఇది మరీబాగుంది! నీ రోగులకి—బాధలకి ఓ నమస్కారం బాబూ! నేనసలు కళ్లతో చూడనుకూడా చూడలేను" రవి నవ్వాడు.

ఇంతలో అక్కడికి, పెద్దపెద్ద గళ్లతో, ముదురాకు పచ్చరంగులో బట్టలు ధరించి, మోచెంపలు పెంచుకున్న ఒకతను, తారాజువ్వలా, రయ్యిన 'అన్నయ్యా' అంటూ వచ్చాడు.

"అన్నయ్యా! నాకు అర్జెంట్‌గా ఒక వందరూపాయిలు కావాలి!" ముఖం సీరియస్‌గా పెట్టి అడిగాడు వేణు.

"ఎందుకురా?"

"ఎందుకా! చిన్నపరీక్ష తప్పానని తెలిసినప్పటినుంచీ, నాన్న యిచ్చే లెక్చర్లు వినలేక చచ్చిపోతున్నాను! బోర్ కొట్టేస్తోంది! కాస్త ఎటయినా తిరిగివస్తే గాని నా ప్రాణం నిల్చేట్టులేదు!"

రవి ముఖం సీరియస్‌గా అయింది.

"వేణూ! నాన్న చెప్పేదంతా నీ మంచి కోసమేననే జ్ఞానం నీ కెప్పుడువస్తుందిరా!" అన్నాడు.

"నేను బ్రతికి వుండగా రాదు. సరేనా? డబ్బు యిస్తావా? లేదా? ఆ మాట చెప్పు ముందు."

"ఇవ్వను! పెద్దవాడు నాన్నవుండగా నన్ను అడుగుతావేం?"

"ఆయన యివ్వడని తెలిసి నిన్ను దేవిరిస్తున్నాను. నువ్వుకూడా యివ్వనంటే నా బాధేదో నేను పడతాను!"

"ఏం చేస్తావేమిటి?"

"చూస్తావుగా నువ్వు?"

"అప్పేగా నువ్వు చేసేది."

"అయినవాళ్లు అవసరానికి యివ్వకపోతే అంతకంటే మార్గం యింకేమిటివుంది?"

వేణు విసురుగా వెళ్లబోయాడు.

రవి చెయిపట్టి ఆపాడు.

"వేణూ! నాన్నని ఎందుకురా యిలా వేధిస్తావు? నీ మూలంగా ఆయన ఎంతవేదన పడుతున్నాడో తెలుసా?" వేణుముఖం మాడ్చుకున్నాడు.

"నాకెలా తెలుస్తుంది? నా కెవ్వరైనా చెబితేగా! అయినా, నా గురించి దిగులుపడవద్దని నేను ఎన్నోసార్లు చెప్పాను! ఆయన వినలేదు! ఆయనకి నా మాట మీద నమ్మకం లేకపోతే నేనేంచెయ్యను?"

"ఆ పరీక్షేదో శ్రద్ధగా చదివి పాసవకూడదూ? ఆయన ప్రాణం నిశ్చింతగా వుంటుంది?"

"నేను శ్రద్ధగా చదువుతూనే వున్నాను! వాళ్లు తప్పిస్తుంటే నేనేంచేయను! అయినా అసలు నాన్నకి ప్రతి చిన్న విషయాన్ని సీరియస్‌గా తీసుకుని, బ్లడ్‌ప్రెషర్ తెచ్చుకోవటం బాగా అలవాటు! లేకపోతే పరీక్ష పోతే దానికింత గొడవఎందుకు? నాన్న పిచ్చిగాకపోతే, ఒక్క డిగ్రీతో మనిషి జీవితం భద్రంగా వుంటుందా? అసలు తెలివితేటలు వుండాలిగాని! యింతకీ డబ్బిస్తావా? లేదా?"

రవి క్షణంసేపు తదేకంగా వేణు ముఖంలోకి చూశాడు. తర్వాత — ఏమనుకున్నాడో ఏమో! లేచివెళ్లి, ఆల్మైరా తెరిచి వంద రూపాయలు తెచ్చి యిచ్చాడు. వేణు సంతోషంగా "మా అన్నయ్య మంచివాడు" అని వెళ్లిపోయాడు.

"ఆదేమిటి రవీ! నువ్వు డబ్బుయివ్వడం నాకేం నచ్చలేదు. అట్లా అడిగినప్పుడల్లా యిస్తే, వేణుయింకామొండివాడవుతాడేమో!" అన్నాడు ప్రసాద్.

"లేదు ప్రసాద్! వాడి తత్వం నీకు తెలియదు! నేను కూడా యివ్వనూ అంటే, ఎవరిదగ్గరైనా అప్పు తీసుకుంటాడు. అది వడ్డీతోసహా మళ్లీ మేమే తీర్చాల్సివస్తుంది! నాన్నకి యింకా వేదన!"

"మీ యిద్దరిలో ఎంత తేడా! చూస్తుంటే నాకే ఆశ్చర్యంగా వుంటుంది. మీ నాన్న అంటే నీ కెంత గౌరవమో, వేణుకి అంత నిర్లక్ష్యం! మీ యిద్దరినీ ఆయనే పెంచారు మళ్లీ!"

"నిజమే! కానీ — వేణు చిన్నవాడనే మురిపెంతో, చిన్నప్పటి నుంచీ. నాన్నా—నేను వాడు ఏది అడిగితే అది యిస్తూ, ముద్దు చేస్తూ, గారాబంగా పెంచాం! దానికి ప్రతిఫలంగా వాడిలా మొండి వాడుగా తయారయాడు!"

"ఒక్కసారి వేణు మాటలు వింటే దిమ్మెరపోయేంత ఆశ్చర్యం వేస్తుంది! తెలివి తక్కువవాడేంగాదు! చదువులో ఎందుకిలా

**జరిగినకథ: 2** రవికి ఉత్తరం వ్రాసి రైలుకిందపడి ఆత్మహత్య చేసుకుంటుంది సరోజ. రవి బి.ఇ. ఫస్టుక్లాస్‌లో పాసయి ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నాడు. పురుషోత్తంగారు పెద్దకొడుకు రవి గురించి ఏ బాధా లేకపోయినా హిప్పీలా తయారయి చదువంటే నిర్లక్ష్యం గల రెండో కొడుకు వేణుని చూసి బాధపడుతూంటారు. తల్లిదండ్రులు లేకపోయినా [illegible] పురుషోత్తంగారి సహాయంతో ఎం. బి. బి. ఎస్. పూర్తిచేసి నర్సింగ్‌హోమ్ నడుపుతున్నాడు ప్రసాద్. [illegible] గారి బావమరిదికూతురిని 30 వేల కట్నంతో పెళ్లిచేసుకొని ఇల్లరికం వెళ్లటానికి ఇష్టపడడు రవి. పిల్లల చదువులకు చేసిన అప్పులు తీర్చటానికి [illegible] పురుషోత్తంగారు.

వెనకబడుతున్నాడో అర్థంగాదు !" అన్నాడు ప్రసాద్.

"తెలివి తేటలు లేక కాదు ! వేణులాటి వాళ్లు జీవితాన్ని సీరియస్‌గా తీసుకోరు. ఎప్పుడు ఎటు గాలి వీస్తే అటు మళ్లుతారు! వాళ్లకి ఎప్పటికప్పుడు జీవితం కష్టంలేకుం- సుఖంగా గడిచిపోతే చాలు! ఇదీ వాళ్లతో వచ్చిన చిక్కు."

రవి నిట్టూర్పు విడిచాడు.

## 3

హైదరాబాద్‌లో — స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ ఆఫీసులో — ఆ రోజున ఆఫీసరు పూనకం వచ్చినవాడిలా వున్నాడు. ఆయన అరుపులకి ఆఫీసు దద్దరిల్లిపోతోంది. ఉగ్ర నరసింహమూర్తిలా వున్న ఆయన కెదురుగా, పొట్టిగా, బక్క పలచగా వున్న చిదంబరం, చేతులు కట్టుకుని, తల వంచుకుని, ఎక్కడలేని వినయం నటిస్తూ నిలబడి వున్నాడు.

అతని వినయం చూసినకొద్దీ, ఆఫీసరు గారికి ఆవేశం రెట్టింపు అవుతోంది. "చాలించవయ్యా నీ పక్కా వినయాలు. ఈ క్షమార్పణలు చెప్పుకోటానికేంలే! మాటలేగా! గాలికిపోతాయి! అంతేగా! మునిగిపోయిన తర్వాత బుద్ధివుండా లయ్యా బుద్ధి! నిన్నసలు క్రిందటిసారే వుద్యోగంలో మంచి వూడబీకి పారేయక పోవటం నాదితప్పు! యిక నీ ఆటలు నాదగ్గర సాగవు. గెటవుట్!" అంటూ చిదంబరం వ్రాసి యిచ్చిన క్షమార్పణ కాగితాన్ని చించి ముక్కలుచేసి అతని ముఖం మీద కొట్టాడు.



చిదంబరం తనమీదపడిన కాగితం ముక్కలని లక్ష్యపెట్టకుండా, రెండు చేతులూ జోడించి దణ్ణం పెట్టాడు. "సార్!

నా వల్ల పొరపాటయి పోయిందని ఒప్పుకుంటు న్నానుగా! పిల్లలు గలవాడిని! తమరు దయుతలచాలి!" కళ్లంబడి నీళ్లు పెట్టు కున్నాడు.

"ఇదుగో! ఆడదానిలా ఏడిచే మగాడిని చూస్తే నమ్మకూడదుట! పిల్లలు గలవాడిని అన్న జ్ఞానమే నీకుంటే యిలాటి దౌర్భాగ్యపు పనులు చేస్తావుటయ్యా! యిట్లా డబ్బుకి గడ్డి తింటావా?"

"చిత్తం! నేను తినలేదండీ! ఈ ఆకాశానికి అంటే ధరలు నా చేత తినిపిం చాయి! ఏది కొనబోయినా మండిపోతోంది. యిద్దరు ఆడపిల్లలు వున్నవాడిని! వచ్చే జీతం ఓ మూలకికూడా రావటంలేదు. ఏదో యిబ్బందుల్లో వున్నానని కక్కుర్తిపడ్డాను."

"యిబ్బందులులేనిది ఎవరికయ్యా! ఎంత వెట్టుకి అంతగాలి! పెద్ద ఆఫీసర్లం అన్న మాటేగాని! మా పాట్లు పగవాడికి కూడా వద్దు. నెలనెల కారుకి చిన్న రిపేర్ వచ్చిం దని పంపిస్తే వెయ్యి రూపాయిలు బిల్ అయింది. పెట్రోల్‌ధర పెంచేసారు. కరెంట్, నీళ్లు, పాలు, నెయ్యి అన్నీ కరువే! అన్నింటికీ యిబ్బందే! అందుకని దేశం మీద పడి దోచుకు తింటమేనా?"

చిదంబరం జవాబు చెప్పలేక పోయాడు. ఆఫీసరు రాజారావు రిటైర్డ్ మిలటరీ మనిషి! కన్నీళ్లు, విట్టూర్పులు, జాలిగా పెట్టినముఖాలు ఆయన్ని కరిగించవని చిదంబరానికి అర్థ మైంది! క్రిందటి నెలలో, విజయవాడనుంచి వచ్చిన పార్టీదగ్గర, వాళ్లలోవ్ తప్పక శాంక్షన్ చేయిస్తానని డబ్బు తీసుకున్నప్పుడే అతనికి యీ వుద్యోగం పోతుందేమోననే అనుమానం వేసింది! అదే నిజమైంది! చిదంబరానికి

## బంగారు కలలు

ఆ క్షణంలో చాలా చిరాకు వచ్చింది. ఏం జీతాలు! గొర్రెకి బెత్తెడు తోక అన్నట్టు ఎప్పటికీ ఎదగవు! ఏ నాలుగేళ్లకో ఏ స్ట్రైయి కులో చెయ్యగా, చెయ్యగా, 10 రూపాయలు పెరిగితే బజారులో ధరలు రెట్టింపు అవు తాయి! ఎన్ని సంవత్సరాలు గడిచినా మార్పు వుండదు! సంసారాలు పెద్దవుతాయి! పిల్లా జెల్లా పెళ్ళిళ్లకి సిద్ధం అవుతారు రోగం-రొష్టు అంటూ ఎక్కడి డబ్బూ చాలదు! జీవచ్ఛవాల్లా బ్రతకాలి! చిదంబరానికి ఏన్నాళ్ల నుంచో యీ గవర్నమెంట్ ఉద్యోగం మానేసి ఎక్కడైనా పది రూకలు సునాయసంగా దొరికే ప్రయివేట్ కంపెనీల్లో చూసుకోవాలని వుంది! దానికి సమయం కలిసి వచ్చింది. యిదిపోతే దీని తాతలాటిది యింకోటివస్తుంది! చిదంబరం వాళ్లకీ, వీళ్లకీ తను వుపయోగ పడతాడు. అవసరం వస్తే వాళ్లని రెట్టింపు తన స్వప్రయోజనానికి వు ప యో గి ం చు కుంటాడు! జీవితంలో యీ యిచ్చిపుచ్చు కోవటాలు లేకపోతే మనిషి బ్రతకటం చాలా కష్టం అని అతని నమ్మకం!

కొద్దిసేపటికి — ఆఫీసరు గారి గదిలో నుంచి, రాజీనామా కాగితం తప్పనిసరిగా సమర్పించి, ధుమధుమ లాడుతున్న ముఖంతో యివతలకు వచ్చాడు, విసురుగా. బైటకి వెళ్లబోతున్న ఆయనకి, వె న క ను ం చి 'మామయ్యా' అన్న పిలుపు వినిపించింది.

చిదంబరం వెనక్కు తిరిగాడు అక్కడ బెంచిమీద కూర్చునివున్న రవినిచూసి ఆశ్చర్య పోయాడు.

"యిదేమిట్రా రవీ! యిక్కడున్నా వెందుకు?" అన్నాడు.

"ఈ ఆఫీసలో క్లర్క్ పోస్ట్ ఒకటి ఖాళీగా వుందిట మామయ్యా! ఇంటర్వ్యూకి వచ్చాను" అన్నాడు రవి.

ఈ మాట వినగానే చిదంబరం ముఖం మాడిపోయింది. అయినా తమాయించు కుంటూ, "ఏమిటి! నువ్వా! క్లర్క్‌పోస్ట్‌కి వచ్చావా?" అన్నాడు ఆశ్చర్యంగా

"ఏం చెయ్యను మామయ్యా! యింటి పరిస్థితులు అలా వున్నాయి"

"అవుననుకో! కానీ - ఖర్మకాలి యీ ఆఫీసులో వచ్చిందా నీకు ఇంటర్వ్యూ! లాభం లేదురా అబ్బాయి! లే! పోదాం!"

"ఏం? ఎందుకని?"

"ఈ ఆఫీసులో ఆఫీసరు వున్నాడే! ఒట్టి కర్కోటకుడు! అలాటి వాడిని ఎక్కడా చూడం! నీలాటి కుర్రాళ్ళు ఎంతోమంది యిటు ఎస్తున్నారు. అటు పోతున్నారు! మాలాటి పెద్దవాళ్లం సెలవు పెట్టడమో, ట్రాన్స్‌ఫర్లు చేయించుకోవటమో చేస్తు న్నారు. ఆ రెండూ కుదరని వాళ్ళు నాలాగా రిజైన్ చేసి పోతున్నారు.

"అదేమిటి? అంత భయంకరమైన మనిషా!"

"భయంకరమా! అబ్బా! ఆ భయంకరం అనేది ఎంతో చెప్పటానికి మాటలు లేవు అనుకో! దుర్వాసుడు మళ్లీ జన్మ ఎత్తాడని అనిపిస్తుంది! ఎంతో ఓపికగలవాడిని! నేను వేగలేక, యిప్పుడే రిజైన్ యిచ్చి యింటికి వెళుతున్నాను."

"అలాగా!" రవి ముఖం నిరాశకి మారు పేరు అయింది.

ఇంతలో ప్యూన్ వచ్చి రవిని, "మిమ్మల్ని పిలుస్తున్నారు సార్" అన్నాడు.

రవి తటపటాయింపుగా చూసాడు.

"నా మాట మీద నమ్మకం లేకుంటే వెళ్ళు! వెళ్లి నీ కళ్లతో స్వయంగా చూసిరా! నాకేం! ఒక్కరోజులో నువ్వు అయన్ని కొట్టి టమో, ఆయన నిన్ను మెడబట్టి గెంటటమో జరగకపోతే, నా పేరు గోయించుకుంటాను! నీకసలే నిలువెల్లా అభిమానం! ఆయన ఒట్టి తొందరపాటు మనిషి! మీ యిద్దరికీకుదరదు.

[34 వ పేజీ చూడండి]





# అజీర్ణం వల్ల మీరు భయపడుతున్నారా? హ్యూలెట్స్ మిక్స్చర్ తీసుకొని - తిరిగి తినడం ప్రారంభించండి!

'జీర్ణశక్తి' తగిన జాగ్రత్త వహించక పోవడంవల్లే ఏమీ
తినలేక పోవడం. బద్ధకంగా ఉండటము — విసుగదల కోపం.
కడుపునొప్పి కూడాను.

హ్యూలెట్స్ మిక్స్చర్ శరణ్యాన్ని పొందండి. అతి
శీఘ్రంగా పనిచేస్తుంది. కడుపులో సంరక్షక పొరగా ఏర్పడు
తుంది. అదనంగా ఉండే ఆమ్లాలను హరించి సరిపరచును.
నొప్పిని నివారిస్తుంది.




విరేచనములకు నల్లమందు చేర్చిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను అడగండి

**సి జె హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్**

మద్రాసు 600 002, కలకత్తా 700 001

SAA/CJH/1192 TEL

# వైకుంఠపాళి - సత్యం మందపాటి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, భేతాళుడు పూనివున్న శవాన్ని చెట్టుపై నుంచి దించి, భుజంమీద వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు.

అప్పుడు శవంలోని భేతాళుడు విక్రమార్కుడికి మౌనభంగం కలిగించాలనే ఉద్దేశ్యంతో "రాజా నీకు వినోదంగా వుండటానికి ఒక కథ చెబుతాను — విను" అంటూ యిలా చెప్పసాగాడు.

అనగా అనగా ఒక వూళ్ళో ఒక ఆఫీసు వుండేది. ఆ ఆఫీసు కొక ఆఫీసరు వుండేవాడు. ఆయన కేవిషయానికూ ఒక పట్టాన నచ్చడు. అందుకని — ఆయన క్రిందే ప్రక్కవూళ్ళో పని చేస్తున్న యింకో చిన్న ఆఫీసరు గారు—ఏంత చెబితే, ఈయన అంతే చేస్తాడు. కారణం ఈ పెద్ద ఆఫీసరు గారెప్పుడో కష్టాల్లో యిరుక్కొని, పోలీసుల కళ్ళల్లో పడ్డప్పుడు — ఈ చిన్న ఆఫీసరుగారు తన చుట్టం అయిన ఒక పోలీసు ఆఫీసర్ని కలిసి, ఈయన్ని రక్షించారుట. అప్పటి నుంచి ఆ పెద్ద ఆఫీసరుగారికి చిన్న ఆఫీసరు గారంటే భయము, భక్తీ, కృతజ్ఞతానూ.

ఈ ఆఫీసరుగారి ఆఫీసులో చారుమతి అనే ఒక ఆడక్లర్కు పని చేస్తున్నది. చాలా చురుకైనది ఆవిడ. కానీ ఆమె అంటే చిన్న ఆఫీసరుగారి కెందుకో నచ్చదు. కారణం ఆ అమ్మాయి ఎవరివేపూ చూడకుండా ( ముఖ్యంగా చిన్న ఆఫీసర్‌గారి వేపు ) తన పనేదో తను చూసుకుంటూ డిస్పాచ్‌లో అంత మంచి క్లర్కు ఎక్కడా వుండరని నిరూపించుకోవడమే. ఆ అమ్మాయి భర్త కూడా అదే ఆఫీసులో టైపిస్టుగా పని చేస్తున్నాడు. యిక చిన్న ఆఫీసర్ గారికి ఈ అమ్మాయి అంటే నచ్చదు అన్నాంకదూ. ఈ అమ్మాయిని ఎలా ఏడిపించాలా అని దాదాపు సంవత్సరం ఆలోచించాడు. ఈలోగా ఆ అమ్మాయి గర్భిణీ అయింది. ఏడవనెల కూడా వచ్చింది. ఇంకా కొన్నాళ్ళలో మెటర్నరీ సెలవుమీద, మొదటి కాన్పు కనుక యింటికి కూడా వెడదామనుకున్నది. వాళ్ళది చాలా అన్యోన్య దాంపత్యం అవటం వల్ల ప్రతిరోజూ శంకర్రావు (ఆ అమ్మాయి భర్త) ఆ అమ్మాయిని చాలా జాగ్రత్తగా రిక్షాలో ఆఫీసుకి తీసుకువచ్చి తీసుకు వెళ్లేవాడు.

ఒకరోజు చిన్న ఆఫీసరుగారి చిన్నబుర్రలో ఒక చిన్న ఆలోచనవచ్చి, పెద్ద ఆఫీసరుగారి చెవిలో ఊదారు. పెద్ద ఆఫీసర్‌గారికి స్వంత భార్య మాటకన్నా చిన్న ఆఫీసర్ గారంటేనే గురి ఎక్కువ! అందుకే వెంటనే తల వూపాడు.

ఆఫీసుకి రాగానే చారుమతికి ఆఫీసర్‌గారు పిలుస్తున్నారంటూ శ్రీముఖం వచ్చింది.

చారుమతి తప్పులనేవి అసలు చేయదు కనుక ధైర్యంగానే వెళ్ళింది లోపలకు.

"ఆడవాళ్ళు ఆఫీసుల్లో మగవాళ్ళతోపాటు పని చేస్తున్నారు. సమానత్వం క్లయిమ్ చేస్తున్నారు. భేష్—గర్వించదగ్గ విషయం— చూడండి చారుమతిగారూ! ఆడవాళ్ళు మగవాళ్ళలాగానే ఆఫీసులో అన్ని పనులూ చేయగలగాలి. ఏమంటారు?" అన్నాడు ఆఫీసరు

చారుమతికి ఏమీ అర్థంకాలేదు. అసలు టాపిక్కే బోధపడలేదు. అయినా 'ఎస్సార్' అన్నది.

"దట్సు గుడ్! మీరు యివాళ్టినుంచి సీటు మారాలి. మీరు జీతాల బిల్లులు తీసుకొని ట్రెజరీకి వెళ్ళాలి. అక్కడ పాస్ చేయించుకుని, బ్యాంక్‌కు వెళ్ళి, కాష్ తీసుకోవాలి యిక్కడకు వచ్చి ఆ ఎమౌంట్ డిస్బర్స్ చేయాలి. అంతేకాదు మన చిన్న ఆఫీసరుగారి క్లర్కు యివాళ జీతాలు తీసుకుపోవటానికి రావటంలేదు అందుకని మీరు యిక్కడ పనంతా చూసుకుని ఈ సాయంత్రమే ఆవూరు వెళ్ళి, జీతాలు అక్కడా యిచ్చేసి వచ్చేయండి ఒకటవ తారీఖుకదా— అక్కడి స్టాఫ్ ఎదురు చూస్తుంటారు మీరు ఎంత త్వరగా పూర్తిచేస్తే అంతమంచిది. మిస్టర్ అప్పారావు దగ్గర నాసంతకం పెట్టిన శాలరీ బిల్లు వుంది—తీసుకుని వెంటనే వెళ్ళండి—!" గబగబా అన్నాడాయన

చారుమతికి ముందు నోటమాట రాలేదు. ఆవిడకు తెలుసు ఆపని ఎటువంటిదో. రెండు మైళ్ళు నడచి ట్రెజరీకి వెళ్ళాలి. వెళ్ళటం పెద్ద కష్టం కాకపోయినా, ట్రెజరీలో బిల్లు ఒకపట్టాన పాసవదు కారణం ఆ క్లర్కు పదిహేనేళ్ల అనుభవం కలవాడు. అందుకని ఏ పనీ తొందరగా పూర్తి చేయడు అంతే



కాదు, ఆరోజు ఒకటవ తారీఖవటం మూలాన, అన్ని ఆఫీసుల క్లర్కులు బిల్సుతో వస్తారు కనుక చాల రద్దీగా వుంటుంది. అక్కడి నుంచి బాంక్ ఒకటిన్నర మైళ్ళు. ఆ రోజు శనివారం అవటం వలన బాంక్ పన్నెండు గంటలకే మూసివేస్తారు. ఈ లోగానే అక్కడికివెళ్ళి, ఆ పని పూర్తి చేసుకోవాలి. కానీ—ప్రక్క వూరు వెళ్ళటమే కష్టం. ఊరు ప్రక్కదే కాని సరి అయిన ట్రాన్స్‌పోర్ట్ లేదు. బస్సు దొరికితే ప్రయాణమే గంటన్నర. అక్కడ పని చూసుకుని తిరిగి వచ్చేసరికి దాదాపు అర్ధరాత్రే అవుతుంది. ప్రతి సారీ వచ్చే ఆ క్లర్కు ఆ రోజు ఎందుకు రావటం లేదో—అన్నిటికి మించి ఇవాళ లేడీ డాక్టరు పీరియాడికల్ చెకప్ చేయవలసినరోజు. జీతం వస్తుంది కనుక ఆవిడకు యివాళే డబ్బుకూడా యివ్వాలి.

"త్వరగా వెళ్ళండి — ఇంకా ఇక్కడే నిలబడితే ఎలా!" అన్నాడు ఆఫీసర్ విసుగ్గా.

చారుమతి నెమ్మదిగా అంది - "సార్—ఎప్పుడూవెళ్ళే అప్పారావ్‌గారు యివాళ వచ్చారు కదా— ఆయనే వెడితే..." చిన్నగా నసిగింది.

'అది నాకు తెలుసు—కాని నేను వెళ్ళమంటున్నది మిమ్మల్ని"—అన్నాడు ఆఫీసర్ కటువుగా.

చారుమతికి ఏంమాట్లాడాలో తెలియలేదు.

కొంచెం ఆగి, మెల్లగా తన పరిస్థితి అంతా వివరించి చెప్పింది. తనకు ఏడవనెల అని కూడా చెప్పింది.

ఆయన తన మాటకు తిరుగులేదు అన్నట్టు మన్నాడు.

ఆమె చేసేదిలేక వెనుదిరిగింది.

పదినిముషాల తర్వాత—మిస్టర్ అప్పారావ్ ఆఫీసర్‌గారి గదిలోకి వచ్చాడు. నెమ్మదిగా అన్నాడు — "సార్ ఈరోజు కూడా ట్రెజరీకి నేనే వెడతాను సార్—సైకలు వుంది కనుక పనులన్నీ చకచక పూర్తిచేసుకు రాగలను —"

అతని మాటకు అడ్డంవస్తూ అన్నాడు ఆఫీసర్ "అప్పారావ్! మీరు నాకు సలహా లిచ్చేంత పదవిలో లేరు. కనుక నేను చెప్పిన పని చేయండి. మిగతావి మీ కనవసరం. వెళ్ళి చారుమతి స్థానంలో డిస్పాచ్ సీటులో కూర్చోండి" కటువుగా అన్నాడాయన.

అప్పారావ్ ఏదో చెప్పబోయాడు.

"యుకెన్ గో!" గట్టిగా అన్నాడు ఆఫీసర్.



కాసేపటికి స్టైపెన్స్ శంకర్రావ్ అడుగు పెట్టాడు ఆఫీసర్ గదిలోకి.

"సార్"! అన్నాడు. ఆఫీసర్ తలఎత్తాడు.

"ట్రెజరీకి, వాటికి నేను వెడతానుసార్—చారుమతికి టైపు చేయటం బాగావచ్చు లోయర్ కూడా పాసయింది. తను నేను చేయవలసిన కాగితాలు యిక్కడే వుండి టైపు చేస్తుంది!" అన్నాడు.

"మిస్టర్ శంకర్రావ్ — మైండ్ యువర్ బిజినెస్ అండ్ యుకెన్ గెట్అవుట్ ఆఫ్‌దిస్ రూమ్!" దాదాపు అరిచినంత పని చేశాడు ఆఫీసర్.

యిలా, నీ లాగానే ఆయనకూడా పట్టిన పట్టు వదలలేదు — భేతాళుడు చెప్పటం ఒక క్షణం ఆపి మళ్ళీ మొదలెట్టాడు.

చివరకు ఆ అమ్మాయిచేత ఒక కాగితం వ్రాయించుకున్నాడు. ఆ అమ్మాయి పరిస్థితి అంతా రాస్తూ — ప్రస్తుతానికి ఆ పరిస్థితుల్లో తాను ట్రెజరీకి వెళ్ళలేనని వ్రాసి యిచ్చింది. ఆయన ఆ కాగితాన్ని పై ఆఫీసరుకి చూపించి, డిసిప్లినరీ యాక్షన్ పేరుతో ఆ అమ్మాయిని యింకో వూరు ట్రాన్స్‌ఫర్ చేయించాడు! ఆమె భర్త తనని కూడా అదేవూరు ట్రాన్స్‌ఫర్ చేయించమన్నాడు. ఆయన వినలేదు. అలా నిండు మాసాలుగావున్న భార్యను, భర్తనుంచి వేరు చేసి, పుణ్యం కట్టుకున్నాడు ఆ అధికారి!

కానీ యిక్కడే నే చెప్పబోయే మనవాళ్ళ సంగతి ప్రారంభం అయేది. శంకర్రావ్ బాబాయి పెళ్ళాం — హైదరాబాద్‌లో మరి పెద్ద ఆఫీసర్‌గారి మేనమామ కావమరిదికి స్వయానా పినతల్లి కూతురు. అందుకే శంకర్రావ్ నాలుగు రోజుల్లో ఈ ఆఫీసర్ గారి ఆర్డర్ కాన్సిల్ చేయిస్తూ, తన భార్యను అక్కడే రిటైన్ చేస్తున్నట్టుగా ఆర్డర్ తెప్పించాడు. బిత్తర పోయిన ఆఫీసర్‌గారు సర్దుకుని, అతని భార్య బదులు శంకర్రావ్‌నే ఆవూరు ట్రాన్స్‌ఫర్ చేద్దామని ప్రయత్నం చేయబోయాడు. కాని ఆరోజే హైదరాబాదులోని పై ఆఫీసర్‌గారి నుంచి ట్రంకాల్ వచ్చింది—అటువంటి ప్రయత్నాలు చేయటం—ఆరోగ్యానికి మంచిది కాదని. అందువలనే ఆయన ఏం చేయలేకపోయాడు. యింతకీ చెప్పబోయేదేమిటంటే — పైన మనవాడంటూ ఒకడుంటే — చిన్నవాడే ఎన్నో పెద్దపనులు చేసేయగలడు. ఎలావుంది నేను చెప్పిన మనవాడి కథ —" భేతాళుడు కథ పూర్తిచేసి విక్రమార్కుడ్ని అడిగాడు.

విక్రమార్కుడు పకపకా నవ్వాడు. "ఇది మామూలుగా చాలా ఆఫీసుల్లో జరిగే కథల్లాంటిదే — కానీ నేనో కథ చెబుతాను విను. ఈ కథ డిపార్టుమెంటు ఎద్యం చర్లలో ప్రథమస్థానం ఆక్రమిస్తుంది. యితరత్రా ఏమీ శక్తిలేని చిన్న వుద్యోగులు — భగవద్గీత లాగా పారాయణం చేసుకుంటూ — గొప్పగా

తెప్పుకుని-ఆ గొప్పతనంలోనే తమ బీదతనం, అసహాయత, మరచి పోతుంటారు.

అనగనగా ఒక వూళ్ళో ఒక ఎస్. ఇ.గారు (సూపరింటెండింగ్ యింజనీరుగారు)ఒకసారి తన క్రింద వున్న ఒక వర్క్‌స్పాటుకి యిన్‌స్పెక్షన్‌కి వెళ్ళారు. అక్కడి సూపర్‌వైజర్ గారు పై ఆఫీసర్లకు కాకాలు కొట్టటం, కాఫీలు పోయించటం, కోడిపలావ్‌తో మేపటం ఏమాత్రం వచ్చనివాడు. కొత్తగా కాలేజీలో నుంచి బయటపడి, వుడుకుతున్న రక్తంకల వాడు. పక్కన వున్న యిద్దరు ముగ్గురు చెప్పినా వినకుండా, ఎస్. ఇ. ఇన్‌స్పెక్షన్ రోజున ఆయన తిండికీ, త్రాగుడికీ ఏమీ ప్రయత్నాలు చేయలేదు. అందుకని ఎస్. ఇ. గారికి అందరిలాగానే కోపం వచ్చింది. సూపర్‌వైజర్ గారివర్కూ, వర్క్‌స్పాటూ అన్నీ బాగానే వున్నా ఏమీ పని జరగటం లేదని, అదని-యిదని సణుక్కున్నాడు. పెద్దగా అందరితో అక్కడే అన్నాడు కూడాను. అంతటితో ఆగక ఫూల్స్, గీల్స్ అని మాటలూ మీరాడు. ఉడుకుతున్న సూపర్‌వైజర్‌గారి రక్తం బాగా మరిగింది. ఎస్. ఇ. గారు జీపు ఎక్కబోతుండగా దారికి అడ్డంగా నిలబడ్డాడు. ఆయన అన్నమాటలు ఉపసంహరించుకుంటే మర్యాదగా ఉంటుందన్నాడు.

డిపార్టుమెంట్ చరిత్రలోనే ఎస్. ఇ. అంతటి పెద్దవాడిని, సూపర్‌వైజర్ అనే చిన్నమనిషి ప్రప్రథమంగా ఎదిరించడం అపురూపం, ఆశ్చర్యకరం. అందువల్ల ఎస్. ఇ. గారు చాలా సేపటి వరకూ, తనెవరో, ఏ వూళ్ళో ఉన్నాడోకూడా మరచిపోయి, నోట మాట రాక అలాగే నించున్నారు. కాసేపటికి తేరుకుని తనెవరో, అతనెవరో గుర్తు తెచ్చుకుని మండిపడ్డారు.

అయినా లాభం లేదన్నాడు సూపర్‌వైజరు.

"నేనెవరో తెలుసా ఎస్. ఇ. ని" అన్నాడాయన—నువ్వెవరో తెలుసా ఆఫ్టరాల్ సూపర్‌వైజర్‌వి అనే అర్థంతో.

"అయినా సరే ముందు మీరు అనవసరంగా మీరిన మాటలు ఉపసంహరించుకోండి" అన్నాడతను.

అతన్ని అడ్డులెమ్మన్నాడు ఎస్. ఇ.

"లేస్తాను అపాలజీ చెప్పండి సార్" అన్నాడు సూపర్‌వైజర్.

ప్రక్కనేవున్న మిగతా యింజనీర్లు, కొంచెం పెద్దవాళ్ళు, సూపర్‌వైజర్‌ని భయపెట్టారు. "ఆయ్—ఇంత పొగరు పనికిరాదు—ఆయన ఎవరనుకున్నావ్ — ఆయన తిడితే యింకా పెద్ద పెద్ద వాళ్ళే చిరునవ్వుతో స్వీకరిస్తారు, నువ్వేమిటి ఏదో పెద్దవాడిలా—" అన్నారు.

ఇతను ససేమిరా అన్నాడు. అలాగే దాదాపు ఒక గంటసేపు మండు టెండలో నిలబడ్డారు అంతా. ఒకరిద్దరు బలవంతాన అతన్ని ఎస్. ఇ. గారి దారికి అడ్డు తీయబోయారు. "నన్ను ముట్టుకుంటే మర్యాద దక్కదు జాగ్రత్త!" అని గట్టిగా అరిచాడతను—చొక్కాచేతులు పైకెత్తి. అతను మిష్నర్ కాలేజి అవటంవల్ల, అతని కండలు బాగా పుష్టిగా ఉంటాయి.

ఎండ ఎక్కువ కావటంవల్ల, అవమానంవల్లా ఎస్. ఇ. గారికి చమటతో బట్టలు తడిసిపోతున్నాయి. చివరకు మెల్లగా, గాయత్రీ ఉపదేశం చేసినట్టు-సూపర్‌వైజర్ చెవిలో అపాలజీ చెప్పేశాడు.

సూపర్‌వైజర్ వెంటనే తప్పుకుని — "నమస్తే సార్!" అని ఆయనకు దారి యిచ్చాడు. జీపు దుమ్ములేపుకుంటూ వెళ్ళిపోయింది.

రెండోరోజునే ఎస్. ఇ. గారు హైదరాబాద్ వెళ్ళారు. ఆ సూపర్‌వైజర్‌ని పనిష్‌మెంటు ఏరియాకు ట్రాన్స్‌ఫర్ చేయించాలో కూడా ముందుగానే నిర్ణయించుకున్నాడాయన.

ఆయన వెళ్ళి పై ఆఫీసర్‌ని కలిశాడు. కలిసి--యిలా ఫలానా మనిషికి, ఫలానాచోటుకి ట్రాన్స్‌ఫర్ కావాలని చెప్పాడు.

"కొంచెం ఆగండి - ఇదిగో ఈ కాగితం మీకు పంపిద్దామనుకుంటుండగా మీరే వచ్చేశారు" అంటూ ఎస్. ఇ. గారికి ఆ కాగితం అందించాడు ఆయన.

ఆ కాగితం చదువుకున్న ఎస్. ఇ. గారికి నోటమాట రాలేదు సూపర్‌వైజర్ని ఎక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయిద్దామనుకున్నాడో, అదే చోటికి తననే ట్రాన్స్‌ఫర్ చేస్తూ యిచ్చిన ఆర్డర్ అది.

ఇలా జరగటానికి కారణం అంతా—మనవాళ్ళే. సూపర్‌వైజర్‌గారికీ ఒక 'మనవాడు' వున్నాడు సూపర్‌వైజర్‌గారి బామ్మ తమ్ముడి మనవడి బావమరిది అప్పుడు మంత్రిగా వుంటున్నాడు. ఆయన్ని కలిసి విషయమంతా చెప్పాడు సూపర్‌వైజర్. తన మీద తప్పకుండా ఆయన ఏక్షన్ తీసుకుంటాడు కనుక, ఎలాగోలా ఎదురు దెబ్బ కొట్టమన్నాడు. ఆయన గట్టిదెబ్బ కొట్టాడు. చూశావా మనవాడంటూ ఒకడుంటే పెద్ద పెద్ద వాళ్ళని శంకరగిరి మాన్యాలను దాటించవచ్చు!" అని ముగించాడు విక్రమార్కుడు.

ఈ విధంగా విక్రమార్కుడికి మౌనభంగం కావటంతో, భేతాళుడు శవంతోసహా మాయమయి చెట్టు ఎక్కాడు.

"ఈ భేతాళుడి శవాన్ని, మౌనభంగం కాకుండా తీసుకువెళ్ళటానికి మనవాడెవడయినా సహాయంచేస్తే బాగుండు" ననుకుని, గాఢంగా నిట్టూర్చాడు విక్రమార్కుడు.






## ప్రతి సంవత్సరము దీని ప్రసిద్ధి పురోగమనము పొందుచున్నది

# లిప్టన్ రూబీ డస్ట్




లిప్టన్ రూబీ డస్ట్ యింత త్వరితంగా ప్రసిద్ధి పొందుటకు కారణమేమి? ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పులు టీని కోరే మీవంటి ప్రజాబాహుళ్యమే కారకులు. దీని కమ్మని రుచి, యింపైన సువాసనతో కూడిన చిక్కని డికాక్షన్ తప్పనిసరిగా తృప్తి నిచ్చుచున్నది.




ప్యాకెట్లలోవున్న టీ మాత్రమే తాజాతనము, సువాసన నిలిచివుండును

## ఒక్కొక్క ప్యాకెట్టుకు అనేకమైన కప్పులు హెచ్చుగా ఇవ్వడమువలననే మీ ఆదరాభిమానాలు పొందగలిగినది

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**పి. ఎల్, వాల్తేరు.**

నాకు రెండు వం. నుంచి గుండెల్లో నెప్పి వస్తున్నది. 3 సం. క్రితం ఎక్స్‌రే మొదలయినవన్నీ పరీక్ష చేశారు. ఈ నెప్పి ఎప్పుడూ వుంటుంది. ఎన్నో టానిక్కులు వాడాను. . . .

3 సం. ల ముందర ఎక్స్‌రే తీయించు కున్నదానికి ఇప్పటి పరిస్థితికీ తేడా వుండవచ్చును. ఈ నెప్పి వూపిరితిత్తులకు సంబంధించినదా, లేక కడుపులో పుండు ఏర్పడటం వల్ల వచ్చినదా అని తీర్మానించాలి. 'ఎక్స్‌రే చెస్టు'లో దోషం లేనప్పుడు "బేరియమ్ మీల్ సీరిస్" అనే ఎక్స్‌రేలు తీయించి అక్కడి వైద్యులకు చూపండి. కడుపులో 'ఆసిడ్' ఎక్కువ అయినప్పుడు ఇలా రావచ్చును.

**పి. ఎస్. హైదరాబాద్.**

నాకు బహిష్టు అయ్యే సమయంలో కడుపు నెప్పి వస్తుంది. సంతానం లేదు. దీనికీ సంతానం కలుగక పోవటానికీ సంబంధము వున్నదా?

పిల్లలు పుట్టక పోవటానికీ, బుతుక్రమము వచ్చినప్పుడు వున్న కడుపు నెప్పికీ సంబంధము లేదు. ఈ నెప్పి సాధారణంగా చాలా మంది స్త్రీలలో వుంటుంది. దీనికి కారణాలు ఇదివరకే తెలియజేశాను పిల్లలు పుట్టక పోవటానికి దంపతులిద్దరూ వైద్య పరీక్ష చేయించుకోవాలి. ఆటుపైన వైద్యుల సలహా ప్రకారం మందులు గాని ఆపరేషన్ గాని అవలంబిం చాలి.

**ఎస్. ఆర్. విశాఖపట్నం.**

మాకు తెలిసిన ఒక పాపకు పుట్టిన మూడవ రోజున, రొమ్ములలో నుంచి పాలు వచ్చినవి ఆస్పత్రిలో వారు పాలు పిండి వేశారు. దీనివల్ల తర్వాత ఏమైనా ఇబ్బందులు వున్నాయా?

శిశువు తల్లి గర్భంలో వున్నప్పుడు తల్లియొక్క నెత్తురులోని హార్మోనులు — ఒకే పరిమాణంలో శిశువులో కూడా ప్రవహించడం జరుగుతుంది. పుట్టిన వెంటనే నెత్తురులోని హార్మోనుల పరిమాణం తగ్గటం వల్ల ('విత్‌డ్రాయల్') శిశువులో రొమ్ములలో పాలు రావటం, కొంతమందికి ఋతుక్రమం లో లాగా నెత్తురు జననేంద్రియాలలో నుంచి రావటం సహజం. ఇది ప్రకృతి సిద్ధమైనది. దీనివల్ల అనర్థాలు లేవు. పాలు పిండటం వంటివి చేసిన వారిది తప్పు. పిండినందువల్ల తప్పులేదు.

**వి. ఎస్. ఎమ్. సునాబేడా (ఒరిస్సా)**

మా తమ్మునికి చిన్నతనం నుంచి "కన్‌జెనిటల్ హెర్నియా" ట్రబుల్ వున్నది. రాయవేలూరులో ఆపరేషన్ చేయించమంటున్నారు ఆపరేషన్ లేకుండా వేరే మార్గం లేదా? ఆపరేషన్ చేస్తే ఏదైనా ప్రాణాపాయమా?

ఆపరేషన్ చేయడం 'హెర్నియా'లో వున్న రోగాన్ని బట్టి వుంటుంది. ఏ 'హెర్నియా' ఆపరేషన్‌కైనా ప్రాణాపాయం వుండదని రూఢిగా చెప్పలేము ఆయాసం తగ్గటానికి తాత్కాలికంగా పని చేసే మందులు వున్నా వాటివల్ల ఎక్కువ ప్రయోజనం లేదు. ధైర్యం చేసుకొని ఆపరేషన్ చేయించండి.

**సి. పి. ఎల్. ఆదోని.**

నా ముక్కు చాలా లావుగా వుంటుంది. కాస్మె టిక్ సర్జరీ వల్ల సరిచేయవచ్చా? ఎక్కడ చేస్తారు?

ప్లాస్టిక్ సర్జరీ వల్ల తప్పకుండా సరిచేయ వచ్చును. గుంటూరు, హైదరాబాదు, మద్రాసు వంటి పెద్ద పట్టణాలలో వసతులు వున్నాయి. ఖర్చు విషయం, ఆపరేషన్ చేసేచోటు మీద ఆధార పడి వుంటుంది.

**ఎల్. ఆర్. బొంబాయి.**

గర్భిణిగా వున్న 10 వారాలలో కడుపు నెప్పి, నడుం నెప్పి వుండి గర్భస్రావం అవటానికి కారణం ఏమిటి?

మానసిక ఆందోళన, హార్మోనుల పరిమాణము, ఉద్రేకము, సిఫిలిస్, అనారోగ్యము, గర్భసంచి పెరుగుదల సక్రమంగా లేక పోవటం వల్ల ఇలా జరుగ వచ్చును.

వీటికొరకై లేడీడాక్టర్ల వద్ద పరీక్ష చేయించు కోవాలి. 'ప్రొజెస్టిరాన్' ఇంజెక్షన్లు వాడతారు.

**డి. వి. ఆగిరిపల్లి.**

మా చెల్లెలికి, బొడ్డు పెద్దదిగా వున్నది. పుట్టి నప్పుడు సమంగా లో కోయక పోవటం వల్ల వచ్చిం దని అనుమానం.

ఈ అభిప్రాయం చాలా మందికి వున్నట్లు కనిపిస్తున్నది. దీనిని 'అంబెలికల్ హెర్నియా' అంటారు. దీనికీ బొడ్డు కోసేదానికీ సంబంధం లేదు. బొడ్డు కోసిన తర్వాత పుండు మానటానికి సక్రమ పద్ధతిలో ఆంటిసెప్టిక్ పౌడర్ వేసి డ్రెస్సింగ్ చెయ్యక పోతే కొద్దిగా చీము పట్టి బొడ్డు రంధ్రము పెద్దదవుతుంది. ఈ రంధ్రము ద్వారా కడుపులోని ప్రేగులు కొద్దిగా బయటికి రావటమే ఈ హెర్నియా. దీనికి రంధ్రము మరీ పెద్దదయితే శస్త్ర చికిత్స ద్వారా మూసివెయ్యవచ్చును



జలపాతం మళ్ళీ మెదిలింది మనసులో ... తను అన్న మాటలు. జీవితం నీటి ప్రవాహం అయితే, మధ్య మధ్య చిన్న పెద్ద రాళ్ళు కష్టాలు. జలధార రాళ్ళని తప్పించుకుంటూ ఎలా ముందు ముందుకు సాగుతుందో అలాగే మనిషి సాగిపోవాలి. కష్టాలని లెక్కచెయ్యకూడదు నిజమే — తను బెంగపడ కూడదు. కష్టాలు కలకాలం వుండవు. లేచి నుంచున్నాడు రాధాకృష్ణ. ఎదురుగా అఖండ గోదావరి. వచ్చే పోయే రాదారి పడవలు. పడవలమీద సరంగుల ఉత్సాహం. చేపలుపట్టే బెస్తవారి విన్యాసాలు... తమాషాగా వున్నాయి. ఎటు చూసినా పచ్చపచ్చగా కన్నుల పండువుగా వుంది. హుషారుగా ఈల వేసుకుంటూ వెనక్కితిరిగాడు రాధాకృష్ణ.

"బస్ ఎలిపోతోంది, లగెత్తండి బాబు" సోడాలమ్మే కుర్రాడు కేకేశాడు.

పరిగెట్టుకెళ్ళి బస్ ఎక్కేశాడు రాధాకృష్ణ. ఇంకో గంటకి అమలాపురం చేరుకున్నాడతను.

## 9

**(గత సంచిక తరువాయి)**

**శా**రదకి గబుక్కున మెలకువ వచ్చింది. ఎవరో పిలుస్తున్నారు... ఎవరయి వుంటారు? ఇంత రాత్రిళ్ళో అనుకుంది శారద. పక్కనే వున్న రాధాకృష్ణకి మెలకువ రాలేదు. మళ్ళీ పిలుపు. మామగారి గొంతులా వుంది. ఆమె చాలా ధైర్యవంతురాలు. వెంటనే మంచంమీద నుంచి లేచి, చీర కుచ్చెళ్ళు సర్దుకుంది. వరండాలో మెట్లవైపు వున్న దీపం వెలిగించి తలుపు తీసింది. సావిడి మధ్యలో మామగారు నిలబడి పిలుస్తున్నారు. పక్కగా ఎవరో కొత్త అబ్బాయి

"ఏమిటి మామగారూ" అంది ఆదుర్దాగా మెట్లు దిగుతూ

"అబ్బాయి నిద్రపోతున్నాడా ?"

"అవునండీ, లేపమంటారా ?"

"ఊ, లేపమ్మా, డాక్టరుగారికి వంట్లో బాగ లేదట. వారబ్బాయి వచ్చాడు లేపు కృష్ణని" అన్నాడాయన.

అయిదు నిమిషాల్లో రాధాకృష్ణ వచ్చేశాడు

దారిలో రఘు దగ్గర నుండి అన్ని విషయాలు రాబట్టాడు.

డాక్టరుగారికి పెరాలిటిక్ స్ట్రోక్ వచ్చిందట. మరో డాక్టరుకి ఫోన్ చేశారట. ఆయన వచ్చి ఇంజక్షన్ ఇచ్చాడట.

"చెల్లి ధైర్యవంతురాలు నాకన్న, ఇంకో డాక్టర్నికూడా పిలవక్కరలేదంది. కానీ నేనే పిలిచాను. మీరు దగ్గరుంటే నాక్కాస్త ధైర్యంగా వుంటుంది. అందుకే మిమ్మల్ని నిద్రలేపాను. ఏమీ అనుకోకండి" అన్నాడు రఘు.

"మంచిపని చేశారు ... అనుకోడానికేముంది? ఒకరికొకరు సాయంగా వుంటాం. మీరేం కంగారు పడకండి నాన్నగారికి తగ్గిపోతుంది" అన్నాడు రాధాకృష్ణ, రఘు భుజంమీద చెయ్యేసి.

చేతిరుమాలుతో మొహానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు రఘు. అతనికి కొండంత ధైర్యం వచ్చింది.

రెండురోజులకి డాక్టరుగారు బాగా కోలుకున్నారు. ఆయన తమ్ముడు కాకినాడలో డాక్టరు. అన్నగారికి జబ్బుచేసిన సంగతి తెలిసి వెంటనే బయలుదేరి వచ్చేశాడు. ఆయన చాలా హడావిడి మనిషి. అన్నగారి కుటుంబాన్నంతా కాకినాడ తరలించెయ్యాలని ఆయన పట్టుదల. శివరాంగారికి కోనసీమమీద మోజు. ఆ నగర వాతావరణం ఆయనకు నచ్చదు. అమలాపురం వదలాలని లేదు, అయినా తప్పదుకదా! జబ్బుపడ్డాడు.

తమ్ముడి అభిమానం, ప్రేమ శివరాంకి తెలియనివి కావు. మరో నెలకల్లా డాక్టరుగారి కుటుంబం కాకినాడ వెళ్ళిపోయింది. వెళ్తూ వెళ్తూ రాజీని రంగయ్యని కూడా తీసుకుపోయారు వాళ్ళు!

శివరాంగారి కుటుంబం ముక్తేశ్వరం దగ్గర పడవ ఎక్కి వెళ్ళాక గోదావరి ఒడ్డునే చాలాసేపు కూర్చుండిపోయాడు రాధాకృష్ణ. అతని గుండెంతా దిగులుతో నిండిపోయింది. అయినా గోదావరి నడక, హొయలు చూస్తే మనిషిలో దిగులు పోతుంది అతనికి ఎన్నోరోజుల క్రితం శారదతో కలిసి చూసిన

### జరిగిన కథ

జూనియర్ ఇంజనీరుగా పని చేస్తున్న రాధాకృష్ణ రిట్రెంచిమెంటు వల్ల నిరుద్యోగి అవుతాడు భార్య శారదతో స్వంత ఊరికి తిరిగి వస్తాడు. అత్తిమేనత్త రంగమ్మకి శారద అడుగు పెట్టిన వేళావిశేషం వల్ల ఉద్యోగం పోయిందని నమ్మకం. రంగమ్మ కుమార్తె, ఆ యింటికి పెద్దకోడలు శాంతకి మాత్రం శారదంటే అభిమానం. కుసుమకి పిన్ని శారదంటే దైవంతో సమానం. డాక్టర్ శివరాం వద్ద డ్రైవరుగా చేరుతాడు రాధాకృష్ణ. అతని పరిస్థితి తెలిసిన డాక్టరు తన స్నేహితునిగా చూసుకుంటుంటాడు. మెడిసిన్ చదువుతున్న డాక్టర్‌గారి అమ్మాయి లత, ఇంజనీరింగ్ చదువుతున్న డాక్టర్‌గారి అబ్బాయి రఘు పరిచయం అవుతారు రాధాకృష్ణకి

## 10

కాలం ఇంకో ఏడాదిని తన కడుపులో దాచుకుంది. రాధాకృష్ణ ఒకవైపు ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూ, మరోవేపు ప్రయివేట్లు చెబుతున్నాడు.

రాధాకృష్ణ పనిమీద హైదరాబాద్ వెళ్ళాడు తనతోపాటు ఉద్యోగంలోంచి వెళ్ళిన వాళ్ళందరూ కలిసి హైకోర్టులో రిట్ వేస్తూంటే వాళ్ళతో తనూ కలిసి ఆ పనేదో చూడ్డానికి వెళ్ళాడు.

కోర్టు పనులు ముగించుకుని ఇంటికి వచ్చిన కృష్ణకి స్నేహితుడు ఆనంద్ రాసిన ఉత్తరం అందించింది శారద. ఆ ఉత్తరం అతనిలో సంచలనాన్ని కలగచేసింది.

కృష్ణా!

మన మోహన్ చూశావా, ఎంత పని చేశాడో! రిట్రెంచిమెంట్‌లో ఉద్యోగం పీకిపారేశారని మొన్న ఆత్మహత్య చేసుకో ప్రయత్నించాడు.

కొత్తగా పెళ్ళయింది కదా! కొత్త పెళ్ళికూతుర్ని ఏం చేసిపోదామని వాడి ఉద్దేశమో! ముసిలి తలిదండ్రులు ఉన్నారా? ఏమిటో వాడు. బాగా బెంగపడిపోయాడు. నిన్ను, నన్ను చూసయినా నేర్చుకోకూడదూ! వీలయితే ఒకసారి రా. కాస్త ధైర్యం చెబుదువుగాని.

ఇంట్లో అందర్నీ అడిగానని చెప్పు.

నీ ఆనంద్.

"ఎక్కణ్ణుంచండీ వుత్తరం ?" శారద అడిగింది.

మవునంగా ఉత్తరం అందించాడు కృష్ణ.

గతం అంతా మెదిలింది కృష్ణకి.

రాధాకృష్ణ, ఆనంద్, మోహన్ — ముగ్గురూ మంచి స్నేహితులు. ముగ్గురికీ ఇంజనీర్లవాలని కోరిక. కలలు కన్నారు అలాగే చదివారు చదువయాక రాధాకృష్ణ నాగార్జున సాగర్ వెళ్ళిపోతే ఆనంద్ వ్యాపారంలో దిగితే, మోహన్ విశాఖలో ఒక కర్మాగారంలో ఇంజనీర్‌గా చేరాడు.

తనకు ఉద్యోగం అప్పుడు పోతే, మోహన్‌కి ఇప్పుడు పోయిందన్నమాట. ఎంతో సున్నితమైన

వాడు! ''నేనెంత మొండివాణ్ణి'' అనుకుని నవ్వు కున్నాడు రాధాకృష్ణ.

''పిరికివాడు'' అంది శారద ఉత్తరం చదివి కృష్ణకి ఇచ్చేస్తూ.

''శారదా! రేప్పొద్దున్న వాల్తేర్ వెడతాను.''

''నేనూ వస్తా.''

''నువ్వా? నువ్వెందుకు?'' ఆశ్చర్యంగా అడిగాడు.

''నేనూ రావాలి. రావాలనుంది.''

''ఏమిటీ పిచ్చి?''

''ఏమైనాసరే. నేనూ వస్తా.''

ఒక్కసారి శారద మొహంలోకి చూసి 'సరే' అన్నాడు.

ఆ రోజంతా అతని వెంట వెంట తిరిగింది శారద. ఆ రాత్రి పన్నెండు దాటినా రాధాకృష్ణకి నిద్రరాలేదు. మెల్లగా లేచి కూర్చున్నాడు. ప్రక్కనే వున్న శారద కళ్లు తెరుచుకు చూస్తోంది.

''ఏమిటీ లేచారు?'' అంది లేచి కూర్చుని.

''ఏం లేదు. నిద్రరాలేదు.''

''పడుకోండి.''

''ఊ...'' లేచి కిటికీదగ్గర కెళ్లి నుంచున్నాడు.

శారద అలాగే కూర్చుంది.

కొంతసేపయాక వెనక్కితిరిగాడు. అలాగే కూర్చున్న శారదని చూసి ''పడుకో శారదా!'' అన్నాడు.

ఆమె ఏం మాట్లాడలేదు.

''సరేగానీ, ఏమిటీ నువ్వు? ఉదయంనుంచీ నన్ను నన్నుగా నిలవనివ్వకుండా నీడలా వెంటాడుతున్నావ్. ఇప్పుడుకూడా నేను లేస్తే నువ్వెందుకూ లేవడం? ఏవిటి సంగతి?'' విసుగ్గా అడిగాడు.

''అబ్బె.. ఏంలేదు. ఏంలేదు'' తడబడింది.

''నాకు తెలుసు శారదా! మోహన్‌లాగ నేనుకూడా ఏ అఘాయిత్యమేనా చేస్తానని నీ భయం కదూ?''

''లేదు. లేదు.''

''అంత పిరికితనం నాలో లేదని నీకు తెలీదూ? అంతగా అవసరమయితే ఎంత చిన్న పని చెయ్యడానికి నాకు నామోషీ లేదనీ నీకు తెలుసు కదా? ఏమిటీ నీ అపనమ్మకం నామీద?''

''అహ...కాదు, కాదు''

''నాకు తెలుసులే. ఆనంద్ రాసిన ఉత్తరం నాలో పిరికితనం కలిగిస్తుందేమోనని నీ భయం. అవునా?'' దగ్గరగా వచ్చి అడిగాడు.

నవ్వేసింది శారద

అతన్ని దగ్గరకు లాక్కుని ''ఇంకేం భయం లేదు పడుకోండి'' అంది.

## 11

వాల్తేర్‌లో ఎల్లమ్మతోట దగ్గర బస్ దిగి ఆనంద్ ఇంటికి వెళ్లారు రాధాకృష్ణ, శారద.

''వచ్చావా? ఏమ్మా? మీరూ వచ్చారా? రండి, రండి'' 'సుశీలా' అంటూ లోపలికి కేక వేశాడు వీధిలో కూర్చుని పేపరు చదువుకుంటున్న ఆనంద్. సుశీల లోపల్నించి వచ్చి శారదను, కృష్ణను పలకరించింది.

వాళ్ళందరూ అరగంట కబుర్లు చెప్పుకున్నారు ఆ తర్వాత ''మోహన్ ఇంటికి వెడదామా?'' అన్నాడు ఆనంద్. ''అలాగే'' అంటూ లేచాడు కృష్ణ. ''నువ్విక్కడే వుంటావా శారదా? మేము వెళ్ళొస్తాము''

''అదేమిటీ? నేను రావద్దా?''

''నువ్వు వస్తావా?''

''రానివ్వరా, ఫర్వాలేదు. సుశీలా మేం తిరిగి వచ్చేసరికి...'' ఆనంద్ భార్యవంక అర్ధవంతంగా చూశాడు.

''చిత్తం... దొరగారూ! భోజనాలు రెడీగా వుండాలి. అంతేనా?'' సుశీల సరదాగా అంది.

''అరె... ఇవ్వడెందుకురా... మా పిన్నీ వాళ్ళింట్లో దిగాం... వాళ్ళు మా కోసం ఎదురు చూస్తూ వుంటారు'' రాధాకృష్ణ అభ్యంతరం చెప్పాడు.

''ఫర్వాలేదు దారేకదా చెప్పిపోదాం. ఒకవేళ వీలు కాకపోతే రాత్రికి తప్పదు...'' కారు తాళం చేతిలోకి తీసుకుని అన్నాడు ఆనంద్.

రాధాకృష్ణ పిన్ని పేరిందేవి వీళ్ళని ఒక పట్టాన వదలలేదు.

''అదేమిటీ, రాక రాక కృష్ణుడు మా ఇంటికి వస్తే, మా ఇంట్లో భోజనాలేమిటి? కుదరదు'' అందావిడ.

''కాదండీ... మేము కలుసుకుని చాలా ఏళ్ళయింది. మీరు కాదనకూడదు.'' ఆనంద్ ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

''వీళ్లే దబ్బాయి. కరువుదీరా మాట్లాడుకోండి. నేనేం కాదనను. ఇక్కడే కూర్చోండి. అసలు నువ్వా



ఈ పూటకి ఇక్కడే వుండిపో'' అందావిడ.

''అమ్మమ్మమ్మ అంత పని చేయకండి. అక్కడ మా ఆవిడ గరిట పుచ్చుకుంటుంది''.

ఆనంద్ అభినయం చూసి అందరూ నవ్వారు.

ఆ మర్నాడు భోజనం ఆనంద్ యింట్లో నిశ్చయమైంది

''సరే పిన్నీ .మేము మరో స్నేహితు డింటికి వెళ్లొస్తాము'' అన్నాడు రాధాకృష్ణ.

శారద కూడా ''నేనూ వెడతా'' అంది.

పేరిందేవి మందలింపుగా శారదవైపు చూసి—

''ఏమిటో ? నువ్వూ వెడతావా ? ఇప్పటిదాకా తిరిగివచ్చావు . చాల్చాల్లే ... పడుకుని విశ్రాంతి తీసుకో . అసలే వట్టిమనిషివి కూడా కావు . అస లంతగా తిరగ్గూడదు నువ్వు దిష్టి దిష్టి తగులుతుంది'' అంది.

అంతే .. శారద మొహం అరుణవర్ణం దాల్చింది. తను వింటూన్న దేమిటో తెలీలేదు రాధాకృష్ణకి కొంతసేపటికి అర్థమయింది అత నికి ఎంత పారవశ్యత కలిగిందో ఆ క్షణాన ఏమిటీ శారద తనకు చెప్పనేలేదు ... ఆశ్చర్యంగా శారదనే చూస్తున్నాడు. ఆమె మొహం రోజూకన్న ఎంతో అందంగా కనబడింది నిజమే ! తను చూడలేదు ఏదో ప్రత్యేకమైన అందం, లాలిత్యం శారదలో కనబడింది

''కంగ్రాచ్యులేషన్స్'' అన్నాడు ఆనంద్

''థాంక్యూ సార్ !''

''చూడండి పిన్నిగారూ ! శారదగారికి ఏమీ అలుపు లేకుండా కారులో తీసికెళ్లి తీసుకొస్తాం. ఎందుకంటే మేము ఒక స్నేహితుడ్ని, అతని భార్యని తప్పక చూడాలి వారు కష్టసమయంలో ఉన్నారు. ధైర్యం చెప్పాలి మీరు కాదనకూడదు'' అన్నాడు ఆనంద్ ఆవిడతో

ఒక్కక్షణం ఆవిడ ఆనంద్ మొహంలోకి చూసింది

''సరేమరి. మీరంతగా చెబుతుంటే ఏం చెయ్యడం ? చూడమ్మా శారదా, వెళ్లి మొహం కడుక్కుని రా ... కాస్త మజ్జిగ ఇస్తాను తాగి వెళుదువుగాని'' అందావిడ లోపలికి వెళ్లిపోతూ !

శారద ఆశ్చర్యపోయింది. తన అత్తగారే అను కుంటే ఆవిడని మించిన మంచి హృదయంగల పేరిందేవి అంటే శారదకు చాలా గౌరవం, ప్రేమ ఏర్పడింది. ఇంత మంచివాళ్ల కుటుంబంలో పడటం తన అదృష్టం అనుకుంటూ మొహం కడుక్కో డానికి వెళ్లింది.

* * *

రాధాకృష్ణని, శారదని చూస్తూనే మోహన్ చాలా సంతోషపడ్డాడు.

''అబ్బ ! ఎన్నాళ్లయిందిరా ? మనం కలుసు కుని ? . నిన్న, మొన్న కాలేజీ వదిలినట్లయింది.'' అన్నాడు మోహన్.

శారదా, సావిత్రీ వంట ఇంట్లోకి వెళ్లారు

స్నేహితులు ముగ్గురూ మాటల్లో కాలేజీ జీవితాన్ని మళ్లీ ఒకసారి తిరగేసుకున్నారు

''చూడరా కృష్ణా ఈ ఆనంద్ ఎందుకా ఉత్తరం రాయడం నీకు ? కంగారుపడడానికి కాకపోతే !''

''అంటే నీ ఉద్దేశమేమిటీ ? నాకు ఉత్తరం రాయకూడదనా ? వెధవపని చేసి పైగా ఆనంద్ రాశాడని పితూరీ చెబుతున్నావా ?''

రాధాకృష్ణ చివాట్లు వేశాడు మోహన్ని

''అనండిరా, అందరూ నన్నే అనండి నా పరి స్థితి నీకు తెలుసు కదరా ! కృష్ణా''

''నా పరిస్థితి మాత్రం . నన్నూ రిటెంచి చేశారు కదా ! నేను అధైర్యపడ్డానా ? ఒరేయ్ మీకు తెలుసా ? డ్రయివర్గా పని చేశా నా నేను. మీకు చెప్పలేదుగానీ.. ఏం ? ఆశ్చర్యంగా వుందా?'' రాధాకృష్ణ గర్వంగా తలెగరేశాడు.

''గుడ్ మంచి పని చేశావు'' అన్నాడు, ఆనంద్.

''ఛా .. అదేం పనిరా ? మన డిగ్రీ ఏమిటి మనం ఏమిటి ? అలాంటి పని ఎలా చేశావురా -'' మోహన్ చీదరింపుగా అడిగాడు

''ఏడిశావులేవోయ్ ! ఉద్యోగంలోంచి తీసేస్తే ఉరోసుకు చావాలా ఏమిటీ ? కొంప మునుగుతుందా? అయినా ఏ పని అయితే ఏమిటీ ? నెలకు వంద రూపాయలు కళ్ళచూసేవాడిని. అంతా దురదృష్టం ఆ డాక్టరుగారు మకాం ఎత్తేశారు కాబట్టిగాని. లేకుంటే ఎంతో హాయిగా వుండేది '' రాధాకృష్ణ నవ్వుతూ కుర్చీలో వెనక్కి వాలాడు విశ్రాంతిగా.

''నిజం కృష్ణ చెప్పింది తప్పేమిటి ? నెలకు వంద తక్కువా ? మంచి పని చేశావురా కృష్ణా ! మన మోహన్లాగ నీకు ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ లేనందుకు సంతోషంగా వుంది''

''అంతే నంటావా ? అన్నాడు మోహన్

''మరి అంతే''

''ఒరే అబ్బాయిలూ ! నాకో మంచి ఉపాయం తట్టింది అది ఆచరణలో పెట్టడానికి మీ సహాయం కావాలి సాయంత్రం రామకృష్ణా బీచిలో కూర్చుని చెపుతాను. మీ రిద్దరూ తప్పకుండా రండి అన్నట్లు. అప్పుడు ఎవరూ భార్యలని వెంటేసుకు రాకూడదు మంచి కబురు చెప్తాను మీ రిద్దరూ రెడీగా వుండండి ఇప్పుడేమో నా కాకలేస్తోంది నే వెళ్ళిపోతున్నా'' అంటూ ఆనంద్ లేచాడు మిగి లిన ఇద్దరూ నవ్వేశారు

అసలెప్పుడూ అంతే ఆనంద్ హాస్యాన్ని అందిస్తూ వుంటాడు మోహన్ ఎప్పుడూ గంభీ రంగా వుంటాడు

''మా ఇంట్లో భోంచేసి వెళ్ళండిరా'' మోహన్ ఆహ్వానించాడు.

''కుదరదురా .. మా పిన్ని కాచుక్కూచుం టుంది'' రాధాకృష్ణ అన్నాడు.

''డిటో...అంటే మా యింట్లో వేచివుండేది పిన్నికాదు కానీ మా ఆవిడ ... నీకు తెలుసుగా మా ఆవిడ పరమ మహంకాళీ అవతారం. చెప్పాపెట్ట కుండా యింట్లో తిండికి గైర్హాజరయితే క్రాస్ క్వశ్చన్స్ వేసి చంపుతుంది. అసలే లాయరుగా రమ్మాయి .. అబ్బో ... నాకు భయం.'' ఆనంద్ హుషారుగా అన్నాడు.

''ఛ ఊరుకో వెధవమాటలూ నువ్వూను ఆ అమ్మాయి మెత్తనిదనంవల్లే ఇలా వాగుతావు నువ్వు'' మోహన్ మందలించాడు.

''ఓకే ... వస్తాం మరి'' మిత్రులు విడి పోయారు

## 12

రామకృష్ణా మిషన్ దగ్గిర సముద్రతీరం కళకళలాడుతోంది. ఎండ పొడ పడి ఇసక అక్క డక్కడ మెరుపులు విసుర్తోంది. మెత్తని ఇసక. నల్లటి చారలు ఇసుకలో.

సముద్రుడు బలే హుషారుగా ఒడ్డును తనలో కలుపుకోవాలని చూస్తున్నాడు. పెద్ద, చిన్న అలలు



ఒకదానితో ఒకటి పోటీపడుతూ ఒడ్డుకువచ్చి చాలామేర నీటితో తడిపి వెనక్కి వెడుతున్నాయి. తడిపడిన భాగంలోని చిన్న చిన్న పీతలు మనిషి పాదాల ధ్వనులు విని కలుగుల్లోకి పారిపోతున్నాయి. సప్తాశ్వ రథసారథిని పడమటిదిక్కు తన విశాల మయిన చేతులతో మెల్లి మెల్లిగా కప్పివేస్తోంది. దూరంగా డాల్ఫిన్సనోస్ (కొండ) ఠీమాగా నిలిచింది.

ముగ్గురు స్నేహితులు బీచిలో కూర్చున్నారు. రాధాకృష్ణ బీచ్ అందచందాలు పరికిస్తున్నాడు

"ఇంతకీ నువ్వేదో మంచికబురు చెప్తానని అన్నావు. అది చెప్పవుకాదేం ?" అడిగాడు మోహన్.

"అవును ఆనంద్ ఏమిటో చెప్పు ఇప్పు డెంతో బావుంది ఈ గాలి, ఈ చల్లదనం, ఈ హాయి, ఈ కెరటాలు, సముద్రం ఎంతో బావుంది. చెప్పెయి. నీవు చెప్పదలుచుకున్నదేదో" అన్నాడు రాధాకృష్ణ మాటల్లో కవిత్వం పలుకుతూ

"చూడొరేయ్. ఈ మోహన్ ఉత్త సినిక్ వాడి ఏడుపు మొహం నాకు కిట్టదు నీ కవిత్వమూ నాకు నచ్చదు. నేను పచ్చి రియలిస్టునిరా. ఈ వేషాలేవీ పనికిరావు నాకు...సరేనా ? అదిసరేరా. వీడు ఎవరు ? మన మోహన్. ఇంత పిరికివాడై పోయాడేమిట్రా ? అదే నాకు బెంగగా వుంది. ఇంత గుండెదిటవు లేకపోతే ఎలా జీవితంలో ?" అన్నాడు ఆనంద్ దిగులుగా మొహంపెట్టి.

"సరేలేరా పెద్ద. ఆ క్షణాన నాకు అసలు ఆత్మహత్య చేసుకునేంత ధైర్యం ఎలా వచ్చిందో తెలీక నే నేడుస్తుంటే మధ్య నీ బెంగ ఒకటి. ఇది వినరా కృష్ణా ! ఆ రోజు అపాయం గడిచి గట్టెంక్కిం తర్వాత ఈ బీచికే, ఇక్కడికే తీసుకు వచ్చి ధైర్యం చెప్పడం పోయి చీవాట్లెయ్యడం మొదలు పెట్టాడురా వీడు ఇదేమైనా బావుందా?" మోహన్ నవ్వుతూ అన్నాడు

రాధాకృష్ణ కూడా నవ్వుతూ "పోనీలేరా... ఆనంద్ సంగతి మనకు తెలీదూ ? వాడుట్టి వెన్న. ఇట్టే కరిగిపోతాడు నువ్వు టపా కట్టేసి వుంటే అసలు వీడు దక్కునా అని వాడి మనసలాంటిది. నువ్వర్థం చేసుకోవాలిరా మోహన్"

"తెలుసులేరా ! మా ఆవిడ ఏమంటుందో తెలుసా ? ఆస్పత్రిలో వీడి మొహం చూసి తను ఏడుపు దిగమింగుకుందిట"

"ఊరుకోండిరా ! నాకు సిగ్గుగా వుంది" ఆనంద్ మొహం ఎర్రబడింది.

"సరి సరి.. నువ్వు చెప్పేదేదో చెప్పెయ్యిరా" రాధాకృష్ణ విషయం మార్చాడు

"చెప్తాను వినండి, మా నాన్నగారు నాకూ, అన్నయ్యకి భాగాలు పంచేస్తున్నారు. నా వాటాకి రెండు బట్టల షాపులు వచ్చాయి ఒక షాపు ఎల్లమ్మ సెంటర్లో, ఇంకొకటి ఈ వెనకవైపు. చూపిస్తాను తర్వాత. ఒక్కొక్క షాపులో ఒక మేనేజరు, ఇద్దరు అమ్మే కుర్రాళ్ళని పెట్టాలని అభిప్రాయం. రెండు కొట్లనీ నేను చూసుకోలేను ఒక షాపులో నేను, మీ ఇద్దరిలో ఒకరు, ఒక అమ్మే కుర్రాడు మరో షాపులో మీలో మిగిలిన మరొకరు, ఇద్దరు అమ్మే కుర్రాళ్ళు... అలా వుంటే వ్యాపారం దెబ్బతినకుండా వుంటుంది. ఏమంటారు ?" అగాడు ఆనంద్.

మిగిలిన ఇద్దరూ ఆలోచిస్తున్నారు

"ఏమ్రా ఏమైనా అభ్యంతరమా ?"

"ఏమీ అభ్యంతరం లేదు నాకు. విశేషంలా వుంది ఆలోచన" అన్నాడు రాధాకృష్ణ.

"నా కసలు లేదు అభ్యంతరం"

"ఎందుకేనా మంచిది .. డబ్బు.. అంటే జీతం సంగతి అదీ ముందే మాట్లాడుకుంటే బావుంటుంది కదురా కృష్ణా!"

"దాని దేముంది ఆనంద్, ముందు వ్యాపారం పడిపోకుండా చూడాలి కదా !"

"అహ... అలాకాదు. " ఆనంద్ చెప్ప బోయాడు.

"ఏది ఏమైనా ఈ డబ్బు గొడవలవల్ల మన మధ్య భేదాభిప్రాయాలు రాకూడదు"

"నిజం కృష్ణ చెప్పింది. స్నేహం దెబ్బతింటే నే భరించలేను' మోహన్ ఆవేశంగా అన్నాడు.

"ఉత్త జావ రకాలురా బాబూ ! ఎలా పుట్టిం చాడో గాని భగవంతుడు మిమ్మల్ని కాదురా, ఒక వైపు వ్యాపారం గురించి మాట్లాడుతుంటే మీరు స్నేహం, చట్టుబండలూ అంటారేమిట్రా, మీకేం అసలు బుద్ధి లేదురా" కోపంగా అన్నాడు ఆనంద్

"చెప్పు ... చెప్పు . వింటాం "

ఆనంద్, మోహన్ ఒక షాపులోనూ, రాధా కృష్ణ మరో షాపులోనూ వుండేటట్లు నిర్ణయ మైంది. వ్యాపార వివరాలన్నీ మాట్లాడుకున్నారు అప్పుడే ఆ విషయాలతోబాటు వారిద్దరికీ ఇచ్చే జీతాలుకూడా నిర్ణయం చేశాడు ఆనంద్

"ఏమిటో, ఆనంద్ వుండబట్టిగానీ లేకపోతే నేనేమయివుండేవాణ్ణో" మోహన్ కృతజ్ఞత నిండిన చూపులతో అన్నాడు

"ఆగరా, ఇలా అనకు ఎప్పుడూ "

"అవును మోహన్, అలాగ నకు, మనం ముగ్గురం స్నేహితులం ఒకరికొకరు ఆదుకోవాలి. తప్పదుమరి" అన్నాడు కృష్ణ.

కొంతసేపాగి మళ్లీ అన్నాడు కృష్ణ.

"ఇంతకీ మీ ఆవిడ కాలేజీలకి ఉద్యోగంకోసం అప్లయి చేసిందట ? ఎక్కడైనా వచ్చే సూచన ఉందా మోహన్ ?."

"కాకినాడలో వచ్చేట్లు వుంది "

"దగ్గరే . ఫర్వాలేదు "

"ఇంక వెడదామా ?" ఆనంద్ లేస్తూ అన్నాడు.

"అన్నట్లు ఆనంద్ ! నేను శారదని అమలా పురంలో దిగబెట్టి వస్తాను "

తల పంకించాడు ఆనంద్.

"ఓ వారంరోజుల్లో వచ్చెయ్యగలవా ?"

"ష్యూర్‌గా వచ్చేస్తాను అంటే నాన్నగారికి వివరాలన్నీ చెప్పి, వీలయితే అప్పుగా డబ్బు తెచ్చి వాటాదారుగా చేర్తే బావుంటుందేమోనని ఆలో చిస్తున్నాను" అన్నాడు కృష్ణ దూరంగా వున్న లైట్‌హవుస్ కాంతిని పరికించి చూస్తూ.

"మంచి ఉద్దేశమే" అది మోహన్ అభిప్రాయం.

"బాగానేవుంటుంది, కానీ ప్రస్తుతానికి మన మనుకున్నది ప్రారంభిద్దాము. నువ్వు చెప్పిన సంగతి మెల్లిగా ఆలోచిద్దాము."

"సరే మరి, వెడదాం పదండి."

(ఇంకా వుంది)

'ఉయ్యాల్లో పాపాయి' అన్న గేయం రాయటానికి మరీ అంత శ్రమ పడ నవసరం లేదు డార్లింగ్!!





- లక్ష్మి

# దిష్టికాయ

కె ఎస్వీ

"అమ్మా! — నేన్దిష్టి కాయల కెళ్తుండా."

అని కేక పెట్టింది గౌరి

"జాగర్తే తల్లీ — జాగర్త — బజార్లో కార్లూ బండ్లూ వస్తుంటాయి — జాగర్త —" అంటూ ఇంకా జాగర్తలు చెబుదామని గుడిసె గుమ్మంలోకి వచ్చింది గౌరి తల్లి కాని, గౌరి ఇంకా అక్కడ నిలబడి లేదు

అల్లంత దూరాన్న అయిదారుగురు పిల్లలతో కూడా పరిగెత్తుతూ కనిపించింది

నిట్టూరుస్తూ గుడిసెలోకి నడిచింది గౌరి తల్లి.

* * *

గౌరి తండ్రి రిక్షా లాగుతాడు

గౌరి తల్లి 'డాకటేరు బాబింట్లో' పాచిపని చేస్తుంది

గౌరి కొక అన్న కూడా ఉన్నాడు వాడు కూరగాయల మార్కెట్టుముందు చిన్న జంగిడీతో కూచుని మిరాయి అమ్ముతాడు

మరి గౌరి ఏం చేస్తుంది ?

తల్లీ దండ్రీ ఆదరణలో అప్యాయంగా పెరుగు తుంది. తల్లి వద్దన్నా వినకుండా తన ఏడేళ్ళ ప్రాయానికి తగినట్టుగా ఇంటి పనుల్లో సాయపడు తుంది

గౌరి చూడముచ్చటగా ఉంటుంది పాల బుగ్గలతో - అమాయకమైన కళ్ళతో — రెండు జెళ్ళతో — ఎంతో ముద్దొస్తూ ఉంటుంది

గౌరి కోసం రిబ్బన్లూ, జడపిన్నులూ, పౌడరూ తెచ్చిపెడతాడు గౌరి అన్న అప్పుడప్పుడూ మంచి గౌను కుట్టిస్తుంటాడు నాన్న ప్రతి శుక్రవారం తలంటుపోసి, వదులుగా జడలు వేసి, కళ్ళకు కాటుక పెట్టి, బుగ్గన దిష్టి చుక్కపెట్టి ముద్దుచేస్తుంది తల్లి

రోజూ సాయంత్రాలూ తన ఈడు పిల్లలతో ఆ సందులోనే ఆడుకుంటుంది గౌరి కాని, శుక్రవారం మాత్రం ఆడుకోదు

ఎందుకు ఆడుకోదు ?

శుక్రవారం గౌరికి ఒక ప్రత్యేకమైన దినం. ఆ దినం సాయంత్రం నుంచి రాత్రి వరకు ఆ పిల్లకు ఆ మహానగరంలోని పెద్ద పెద్ద బజారు వీధుల్లో అతి ముఖ్యమైన పని ఒకటుంది.

ఏమిటా పని ?

దిష్టికాయలు !

బజారులో అన్ని అంగళ్లలోనూ ప్రతి శుక్రవారం కొట్టు మూసేసేముందు పూజ జరుగు తుంది పెద్ద పెద్ద షాపులముందు ఈ పూజ మరీ ఆర్భాటంగా జరుగుతుంది

షాపులో వుండే దేవుళ్ల పటాలకి పసుపూ కుంకుమా పెడతారు. పూలదండలు వేసి అగరొత్తులు వెలిగిస్తారు షాపు షాపంతటినీ సాంబ్రాణి గుగ్గిలం ధూపాలతో ఘుమాయింప జేస్తారు ఎత్తుగా నిండుగా గుంభనంగా వుండే గల్లాపెట్టె ('కౌంటర్')కు చందనం పూతలు పూసి భక్తిగా నమస్కారాలు చేస్తారు.

ఇంతలో ఉత్తరీయాన్ని నడుముకు చుట్టు కున్న మనిషి ఒకడు షాపులోంచి బయటికొస్తాడు. అతని చేతిలో పీలకకూడా ఊడదీసేసిన టెంకాయ ఒకటుంటుంది అందుమీద కర్పూరపు జ్యోతి భగభగమని మండుతూ వుంటుంది.

ఉత్తరీయంవాడు షాపునుంచి ఇవతలి కొచ్చేసి మళ్లీ షాపువేపు తిరిగి, షాపు పైను బోర్డు, కౌంటర్ — అలా కుడినుంచి ఎడమవేపుకి మూడు సార్లు టెంకాయని దిగదీస్తూ తిప్పుతాడు మూడోసారి తిప్పేక ఆ టెంకాయని బాగా పైకెత్తి నేల కేసి పెఠీమని కొడతాడు.

దిష్టికాయంటే — అది

అందుకోసం వెళ్తుంది గౌరి బజార్లో ఎక్కడ టెంకాయ కొట్టినా పరిగెత్తుకు వెళ్తుంది పగిలిన తర్వాత టెంకాయ ముక్కలు పైకెగురుతాయికదా — ఆ ఎగిరినవి మళ్లీ కిందపడే లోపలే సాధ్యమైనన్ని ముక్కల్ని పట్టేసుకుంటుంది బాగా రాత్రయే వరకూ ఇలా ముక్కల్ని సేకరిస్తుంది ఇంటికి తెస్తుంది చిప్పనుంచి కొబ్బరిని వేరు చేస్తుంది దాన్ని నోట్లో వేసుకుని ఆనందంగా తినేస్తుందా ? ఊఁహూఁ — తినదు శుభ్రంగా నీళ్లతో కడిగి తడిగుడ్డలో దాచి జాగర్త చేస్తుంది.

ప్రొద్దున్నే మిఠాయి జంగిడీతో మార్కెట్టుకి వెడతాడు కదూ గౌరి అన్న! — కొబ్బరి ముక్కలు వాడి చేతి కిస్తుంది గౌరి. వాడు బ్లేడు పెట్టి ఆ ముక్కల అంచుల్ని చక్కగా కోసి, జంగిడితో బాటు వాటిని తీసుకుపోతాడు జంగిడీ ప్రక్కనే ఒక గుడ్డ పరిచి అందుమీద ఈ కొబ్బరి ముక్కలు పెడతాడు పెద్ద ముక్కలు పదిహేను పైసలు — చిన్న ముక్కలు పది పైసలు — ఆ లెక్కన ఆ కొబ్బరి అంతా అమ్మేస్తాడు.

ప్రతి శుక్రవారం దిష్టికాయ లేరుకొస్తుంది గౌరి. ఆ విద్యలో ఆ పిల్లను మించినవాళ్ళు ఆ జట్టులో మరెవ్వరూ లేరు కుంటి రత్నం (అది ఆ పిల్లకున్న ముద్దు పేరు — ఆ పిల్లకు ఎడంకాలు కొంచెం కుంటి) ఉందిగాని, ఆ పిల్లమరి గౌరి పరిగెత్తినంత వేగంగా పరిగెత్తలేదు కదా! కొబ్బరి ముక్కలు ఎక్కడెక్కడి కెగిరి పడతాయో ఇట్టే కనిపెట్టగలదు కుంటి రత్నం. కాని, అది వెళ్ళి తెచ్చుకునే లోపలే వాటిని ఎలాగూ స్వాధీనపరచు కుంటుంది గౌరి !

కాబట్టే దిష్టికాయ లేరడంలో గౌరి జట్టుకు గౌరే నాయకురాలు మెయిన్ బజార్లో కొచ్చెక గూఢచారుల్నీ వార్తాహరుల్నీ నాలుగువేపులా పంపు తుంది గౌరి. వార్త అందుతూనే పూజ జరిగే షాపు ముందరికి హుటాహుటిని చేరుకుంటుంది

రాత్రి — విడిపోయేముందు జట్టులో దెబ్బలాటలు రాకుండా సరిచూస్తుంది గౌరి అందర్నీ ఇళ్ళకి పంపించి ఒడినిండుగా ఉన్న తన కొబ్బరి ముక్కలతో తనూ ఇల్లు చేరుకుంటుంది

* * *

"ఈ రోజు ఇంటికి ఒట్టి చేతుల్తో పోవాలేమో —" అనుకుంది గౌరి

చీకటి పడి చాలాసేపైంది బజారు నిండా లైట్లు జిగజిగమని వెలుగుతున్నాయి.

ఆ సరికే చాలా షాపుల్లో పూజలు ముగిసి పోయేయి మామూలుగానే దిష్టికాయల కోసం వెళ్ళింది గౌరి కాని, ఈ దినం కుంటిరత్నం విజృంభించింది గౌరికి ఒక్క ముక్క కూడా దక్క నివ్వలేదు జట్టులో చాలా మంది అప్పుడే కుంటి రత్నం వేపు చేరిపోయేరు అది గౌరికి మల్లే కొబ్బరి ముక్కల్ని దాచుకోదు దొరికినవి దొరికినట్టే నోట్లో పెట్టేసుకుంటుంది. పరికిణీకింద పెట్టి కొరికి, తన జట్టు చేరిన వాళ్ళకి కొంచెం కొంచెం కొబ్బరి పంచిపెడుతుంది.

ఎంగిలి ముక్కలకోసం అందరూ కుంటిరత్నం పక్షం అయిపోయేరు

"ఛీ! — వీళ్లకి బుద్ధయినాలేదు—" అను కుంది గౌరి

గౌరి కేడుపొస్తోంది !

గుడ్లగంగి ఒక్కతె మాత్రం గౌరి జట్టే ఉండి పోయింది గంగి కనుగుడ్లు మిడిగుడ్లు అందుకే జట్టులో వాళ్లందరూ ఆ పిల్లను ఎగతాళిగా 'గుడ్ల గంగి' అని పిలుస్తారు. అందరికీ ఆ పిల్లంటే అసహ్యం. గౌరికి మాత్రం జాలి అందుకే గంగి ఎప్పుడూ గౌరి జట్టే ఉంటుంది

'క్లాత్ సెంటర్' దగ్గర పూజని తెలిసి కుంటి రత్నం బృందమంతా అటు కదిలింది గౌరి కూడా వాళ్ల వెనకే పరుగెత్తింది వెళుతూ వెళుతూ తన వెనకే గంగి వొస్తోందేమోనని చూసిందిగాని, గంగి అక్కడెక్కడా కనిపించలేదు ఆలోచించే వ్యవధి లేక కుంటిరత్నం జట్టువెంట రివ్వుమంటూ పరుగెత్తింది గౌరి.

'క్లాత్ సెంటర్' నిజంగా చాలా పెద్ద షాపు రాత్రయినా అక్కడ వెల్తురు పట్టపగలుగా ఉంటుంది. ఇంద్రధనస్సులో వున్న రంగులూ, లేని రంగులూ కూడా బట్టలుగా మారి అక్కడి అద్దాల బీరువాల్లో నిలుచునివుంటాయి సూటూ,బూట్లతో లోపలికెళ్లిన వాళ్లందర్నీ అక్కడి పనివాళ్లు చిరునవ్వులతోనూ తియ్యతియ్యటి వినయంతోనూ ఆహ్వా నిస్తారు. మనుష్యులకే కాదు, అక్కడి గాలికికూడా

మర్యాద తెలుసు ఆ అంగడి అంతా పూర్తిగా 'ఎయిర్ కన్డిషన్డ్'!

షో కేసుల వారగా నిలబడి అద్దాలగుండా షాపులోకి చూసింది గౌరి లోపల పూజ జరుగుతోంది కౌంటర్ దగ్గరున్న ఆసామీ నోట్ల కట్టల్ని తెల్లటి సంచిలోకి సర్దుతున్నాడు గౌరి దృష్టి అంతా పూజమీదే వుంది బక్కగా పొడుగ్గా వున్న ఆసామీ దిష్టికాయతో షాపు బయటికి వచ్చేడు

ఒక్క ఉదుటున ఉన్న చోటినుంచి కదిలి ప్లాటుఫారమ్మీదికి వచ్చింది గౌరి కుంటిరత్నం బృందం అంతా దిష్టికాయ పగలడంకోసం కాచుకుని వున్నారు వాళ్లంతా చేసే పొరబాటేమిటో గౌరికి తెలుసు దిష్టికాయ పగులుతుందంటే ఆ పగిలేచోటే వాళ్లందరూ గుమిగూడతారు కాయలో సగానికి పై భాగం ఎగిరి అవతల పడుతుందని వాళ్లకి తెలీదు ఎంతో పరిశోధనమీద గౌరి ఈ విషయం తెలుసుకుంది అంతేకాదు, టెంకాయ నేలకేసి కొట్టినప్పుడు ఈ పిల్లల బారినుంచి తప్పించుకోవాలని, గురి ఒకవేపుకి చూసి, నేలకేసి కొట్టడం ఇంకోవేపు కొడతారు ఈ సూక్ష్మం కూడా గౌరి కనిపెట్టింది. అందరూ కాయ వేపు ఆత్రంగా చూస్తుంటే, గౌరి మటుకు కాయ కొట్టేవాడి కళ్ళవేపు పరీక్షగా చూస్తుంగి అందుకే గౌరి ఎప్పుడూ ఎక్కువ ముక్కల్ని సాధిస్తుంది. కాని, ఎలా తెలుసుకుందోగాని, ఈ రహస్యాల్ని కొన్నింటిని తెలుసుకునేసింది కుంటి రత్నం.

కుంటి రత్నం వేపు కూడా జాగర్తగా చూసింది గౌరి

పిల్లలందరూ ముందు నిలబడి దిష్టికాయని దిగదీస్తున్న మనిషివేపు ఆత్రంగా చూస్తుంటే — వాళ్ళందరికి వెనగ్గా నిలబడింది రత్నం మోకాళ్ళ మీద కొంచెంగా ముందుకు వంగి అవసరమైతే ఏ క్షణంలోనైనా పరుగెత్తడానికి సిద్ధంగా ఉంది.

ఈసారి ఎలాగైనాసరే కుంటి రత్నాన్ని ఓడించెయ్యాలని తీర్మానించుకుంది గౌరి శక్తియుక్తులన్నీ కేంద్రీకరించడానికి తయారై బక్క మనిషి కదలికల్ని అతి మెళకువతో పరిశీలించింది

చేతిలో కొబ్బరికాయని పైకెత్తి పట్టుకున్నాడు బక్క మనిషి కాయమీద కర్పూరం కార్తీక దీపంలా వెలుగుతోంది. పిల్లలున్న వేపుగా కాయని కొట్టడానికి చెయ్యి దించినవాడు హఠాత్తుగా ఇంకో వేపు తిరిగి కాయని రపీమనిపించేడు "అనుకున్నట్టే అయింది", అనుకుంది గౌరి. కిందపడిన కాయ పైభాగం పెద్ద ముక్కగా ఎగిరి షాపు చీడీల కవతల పడడం చూసింది. పురుగు మీదికి పిట్ట వాలినట్టు ఒక్క ఉదుటున అక్కడ వాలింది "ఈ పెద్ద ముక్క దొరికితే చాలదూ — చిన్న ముక్కలు మూడు దొరికినంత —" అనుకుంటూ బోర్లా పడిన ఆ ముక్కను చేజిక్కించుకుని దానిని తిప్పి చూసింది.

ఆశ్చర్యపోయింది.

కొబ్బరి లేని ఒట్టి ఖాళీ చిప్ప వెకిలిగా నవ్వుతోంది.

"ఛీ! —" అంటూ చిప్పను నేలకేసి విసిరి కొట్టింది గౌరి.

అవతల కుంటి రత్నం అందరికీ అరిచి చెబుతోంది — "దొరికిందోచ్ దొరికింది — కొబ్బరి దొరికింది — చిప్పకూడా లేదు — ఒట్టి కొబ్బరంటే కొబ్బరే — హాయ్ — ఎంత బాగుందో —" గౌరి వేపు కళ్ళు తిప్పుతూ, ఊరిస్తూ, అభినయిస్తూ చూసి మళ్ళీ అరుస్తోంది — "ఎవరిక్కావాలోచ్ కొబ్బరి — రండ్రండి — తొందరగా రండి — ముందొచ్చినోళ్ళకి పెద్ద ముక్క —"

పిల్లలందరూ కుంటి రత్నం చుట్టూ గుమిగూడేరు. పరికిణీ క్రింద కొబ్బరి మడిచిపెట్టి, నోటిమధ్య పెట్టి కొరుకుతోంది రత్నం.

"ఛీ! — ఛీ! — ఎంగిలి కూడు—" అనుకుంటూ అసహ్యించుకుంది గౌరి

అసహ్యించుకున్నాక వెంటనే ఏం చెయ్యాలో తెలియలేదు గౌరికి ఇంటికి వెళ్ళిపోదామా అనుకుంది ఇవాళ ఒక్కటంటే ఒక్క కొబ్బరి ముక్క కూడా దొరకలేదు ఏనాడూ ఇలా జరగలేదు

ఈ రోజు ఒట్టి చేతులతో ఇంటికి పోవడమెలా ??

కాని, ఏమిటి చెయ్యడం ?

ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది

దాదాపు అన్ని అంగళ్ళలోనూ పూజలైపోయి ఉంటాయి.

ఇంక లాభం లేదు.

ఇంటికి వెళ్ళిపోతే పోతుంది — అనుకుంది గౌరి.

అనుకుంటూ గమ్మున తల వంచుకుని ప్లాటుఫార మెక్కి వారగా నడవసాగింది

(31వ పేజీ చూడండి)



## అభిమన్యుని విజయం!

1973 లో ఎనభై శాతం విజయాన్ని చవి చూచిన శోభన్‌బాబుకు 1974 లో నూరు శాతం తీపిని రుచి చూడాలన్న ఆశ వుండడంలో తప్పు లేదనుకొంటాను

ఈ ఏడు "కన్నవారి కలలు" చిత్రంతో ఆయన తెర జీవితం ప్రారంభమైంది ఈ చిత్రం పెద్ద హిట్ కాకపోయినా, ఆయనకు గ్లామర్ హీరో పట్టాన్ని తెచ్చిపెట్టింది నేను విన్న వార్తలను బట్టి యీ చిత్రం యిరవై లక్షలు ఆర్జించి పెడు తుంది

"జనవరి యిరవై ఒకటి నా జీవితంలో మరపు రాని మంచి రోజు" అన్నారు శోభన్‌బాబు ఆ రోజున ఆయన నటించిన 'ఖయిదీ బాబాయ్' చిత్రాన్ని భారత రాష్ట్రపతి వి వి గిరి, వారి సతీమణి సరస్వతి గిరి తిలకించి, శోభన్‌బాబును అభినందించి, ఆశీర్వదించారు 'ఖయిదీ బాబాయ్' చిత్రానికి టి కృష్ణ దర్శకుడు బాబుల్‌నాథ్ నిర్మాత శోభన్ ప్రతాపం ఆద్యంతం కనిపిస్తుంది, యీ చిత్రంలో దీని తరువాత విడుదలయ్యే 'కోడెనాగు' ఆయనకు 'రిబెల్ హీరో' బిరుదు నిచ్చే చిత్ర మవు తుంది ఈ చిత్రానికి ఏఎస్ ఎస్ రెడ్డి నిర్మాత కె ఎస్ ప్రకాశరావు దర్శకుడు"

### వెరైటీ వేషాలు !

పల్లవి ప్రొడక్షన్స్‌వారి 'అందరూ దొంగలే' చిత్రం శోభన్‌కి 'వసూళ్ల చక్రవర్తి' బిరుదాన్ని యివ్వడం తథ్యం ఈ చిత్రాన్ని ఆనందరావు నిర్మించ, జగపతి రాజేంద్రప్రసాద్ డైరెక్టు చేశారు నే నుదహరించిన మూడు చిత్రాలలో శోభన్ వైవిధ్య మున్న పాత్రలను చేపట్టడం ఒక ప్రత్యేకత మూడింటినీ అనాయాసంగా, న్యాచురల్‌గా నటించడం మరొక ప్రత్యేకత అన్నీ కలర్ చిత్రాలు గావడం మూడవ ప్రత్యేకత

### అభిమానుల ఆప్యాయత

శోభన్‌బాబుకు ఆయన అభిమానులు వ్రాసే ఉత్తరాలలో అనురాగం, ఆత్మీయతాభావం, ఆప్యాయత కనిపిస్తాయి ఆయన అభిమానించే వాళ్ళలో ఎక్కువ శాతం స్త్రీలు, విద్యార్థులు, పండితులు వున్నారు వీళ్ళగాక, అక్కినేని, నందమూరి అభిమాన సంఘాల సభ్యులు కూడా శోభన్‌బాబుకు ఉత్తరాలు వ్రాస్తూ వుంటారు - "ప్రజల అభిమానమే నాకు శ్రీరామ రక్ష" అంటారు శోభన్‌బాబు

### ఎనిమిది చిత్రాలు !

ఎంతో డిమాండు వుండి కూడా, సంవత్సరానికి ఎనిమిది చేస్తే చాలు నన్న నిర్ణయం తీసుకొన్న శోభన్‌బాబును అభినందించడం అపరాధమా? పరుగిడి పాలు త్రాగడం కన్నా నిలబడి నీళ్ళు త్రాగడం మంచిది అంటారాయన పెద్దరికాన్ని గవురవించడంలో ఆయనకు మరొకరు సాటిరారు





రాష్ట్రపతి గిరికి పూలమాల వేస్తున్న శోభన్‌బాబు

ప్రతిదినం ఆయన టేబిల్ ముందు రెండు విగ్రహాలను చూచితీరాల్సిందే. అవి నాగేశ్వరరావు, రామారావుగార్ల ఛాయా చిత్ర పటాలు.

### మంచి నిర్మాతలు !

ఆయనకు దొరికిన నిర్మాత లందరూ ఆర్థికంగా, నైతికంగా మంచి స్థితిని వరంగా పొందిన వాళ్ళు గావడం విశేషం గాదా? మనసిచ్చి, మనసును జయించే వ్యక్తుల సమ్మేళనమే ఆయన నిర్మాతలు ఆయన దర్శకులందరూ ఆ శాఖలో పేరు, ప్రఖ్యాతులు గడించిన వ్యక్తులు గావడం మరొక విశేషం

### నవలా నాయకత్వం !

ప్రసిద్ధ నవలా రచయిత్రులు వ్రాసి, బహుళ ప్రచారం పొందిన కథలలో నాయకుడిగా నటించే అదృష్టం శోభన్‌బాబును వరించింది "చక్రవాకం, బలిపీఠం, ధర్మచక్రం, శాంతి నికేతన్, లలితాదేవి" నవలల ఆధారంగా నిర్మింపబడుతున్న చిత్రాలకు శోభన్ నాయకత్వం వహిస్తున్నారు

### ఒప్పుకొన్న సంస్థలు !

జగపతి, సురేష్, రవిశంకర్, సత్యచిత్ర, లక్ష్మీ ఎంటర్ ప్రైసెస్, సమత చిత్ర, మధు పిక్చర్స్, లక్ష్మీ ప్రొడక్షన్స్, డి వి ఎస్, కృష్ణ కిశోర్, జెమినీ, రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ లాంటి ప్రముఖ సంస్థలలో శోభన్ నటిస్తున్నారంటే, పరిశ్రమలో ఆయన స్థానం ఎంత పెరిగియుండాలి? ప్రజలలో ఆయన పలుకుబడి ఎంత హెచ్చుగా ఉండి వుండాలి?

## అనంతలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ !

ఈ సంస్థ నిర్మించిన మొదటి చిత్రం "ప్రేమలు — పెళ్లిళ్ళు" నిర్మాత భాస్కరరావుకు కొంత లాభాన్ని తెచ్చిపెడుతుంది

ఆయన తన రెండవ ప్రయత్నంగా "భిన్న ధృవాలు" నవలను చిత్రంగా నిర్మించ బూను కొన్నారు ఈ నవలనూ "ప్రేమలు — పెళ్లిళ్ళు" నవలను వ్రాసిన మాదిరెడ్డి సులోచనయే రాయడం జరిగింది సినిమా సంభాషణలు ఆచార్య ఆత్రేయ వ్రాయగలరని, ఈ చిత్రంలో అగ్రశ్రేణి నటీనటులు వుంటారని, నిర్మాత దగ్గుపాటి భాస్కరరావు చెప్పారు

## పాలేరుగా కృష్ణ !

ప్రసన్న లక్ష్మీ పిక్చర్స్ నిర్మిస్తున్న కొత్త కాపురం" చిత్రంలో కృష్ణ పాలేరు పాత్రను పోషిస్తున్నారు ఆయన పాలేరు అయినది ఎలాగో తెలుసా?



"అమ్మాయి పెళ్లి"లో భానుమతి

"అయినవాళ్లు ఎవరూలేని అబ్బాయికి ఏ వూరయితేనేం? తనకున్న ఆస్తల్లా అమ్మ ఒక్కటే. ఆమెతో గమ్యం తెలియని వూరికి పయనం కట్టాడు. ఎండ వేడిమికి తట్టుకోలేక, వస్తులను భరించలేక స్పృహతప్పి పడిపోయాడు పాపం పసివాడు. ఆ రస్తాలో వెడుతున్న రంగారావు ఆ దృశ్యాన్ని చూచి, మనసు కరిగి ఆ అబ్బాయిని తన యింటికి తీసికెడతాడు. అక్కడే పెరిగి పెద్దవాడయ్యాడు. ప్రయోజకుడయ్యాడు. దిక్కు మొక్కు తెలియని తన్ను చేరదీసి, ఒక మనిషిని చేసిన ఆ పుణ్యాత్ముడికి నిరంతరం సేవ చెయ్యడమే ధ్యేయంగా పెట్టుకుని, పంటను పండించి, బంగారాన్ని కురిపించాడు కృష్ణ. అతని మంచితనానికి ముగ్ధుడయిన రంగారావు తన కుమార్తె భారతిని, కృష్ణకిచ్చి పెండ్లి చేస్తాడు. పచ్చగా వున్న సంసారంలో చిచ్చుపెట్టడానికి సూర్యకాంతం లాంటి మనుషులు తయారయ్యారు. కొత్త కాపురం సవ్యంగా సాగిందా? అవరోధాలను ఎదుర్కొన్నదా? అనెడి ప్రశ్నలకు సమాధానం చిత్రం చూసినప్పుడే తెలుస్తుంది." ఈ కథను కళ్యాణీ జగన్నాథ్ యిచ్చారు. బొల్లిముంత మాటలను రచించారు. జి. వెంకటరత్నం నిర్మిస్తున్న యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. ప్రధాన పాత్రలను చంద్రమోహన్, రమాప్రభ, రాజనాల, హేమలత, పద్మనాభం, అల్లు రామలింగయ్య, అనిత పోషిస్తున్నారు. పూర్ణా విడుదల.

## దేవుడిలా అన్నయ్య అనురాగంలా చెల్లెమ్మ

ఫణి మాధవీ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "దొరబాబు" చిత్రంలో నటసామ్రాట్టుకు చెల్లెలుగా చంద్రకళ నటిస్తున్నది. అన్నా చెల్లెళ్ల అనురాగం గురించి కవి దాశరథి వ్రాసిన గీతం:

"దేవుడెలాగుంటాడని ఎవరైనా అడిగితే
మా అన్నలా గుంటాడని చెపుతాను నేను"

అంటుంది చంద్రకళ.

"అనురాగం ఎలా వుంటుందని
ఎవరైనా అడిగితే
మా చెల్లెమ్మలా వుంటుందని చెపుతాను నేను"

అంటారు అక్కినేని.

తల్లి, తండ్రి లేని లోటును కనిపించనీయకుండా తన చెల్లెలిని గారాబంగా, ముద్దుగా, మురిపెంగా పెంచుతాడు అన్నయ్య. తనకు తల్లి, తండ్రి, దైవం అన్నీ తన అన్నయ్య అని ఆరాధిస్తుంది చెల్లెమ్మ. అన్నా చెల్లెలుగా అక్కినేని, చంద్రకళ నటిస్తున్నారు అనడంకన్నా జీవించినట్టు పోషిస్తున్నారు అనడం సమంజసం. ఈ చిత్రంలో దొరబాబును దోచుకునే దొరసానిగా మంజుల నటిస్తున్నది. ముఖ్యపాత్రలను రాజబాబు, సత్యనారాయణ, గిరిబాబు, విజయశ్రీ పోషిస్తున్నారు. తాతినేని రామారావు దర్శకత్వం నెరపుతున్న ఈ చిత్రాన్ని రాజేంద్రప్రసాద్, సుబ్బారావు నిర్మిస్తున్నారు.

## రాజశేఖరంగా శోభన్‌బాబు

"శాంతినికేతన్ నవలను, రంగుల చిత్రంగా నిర్మించబోతున్నారు, రామానాయుడు. అందులో రాజశేఖరం పాత్రను నేను పోషిస్తున్నాను" అన్నారు శోభన్‌బాబు. "ఈ చిత్రంలో వాణిశ్రీ నాయికగా నటిస్తుంది. కె. బాపయ్యకు దర్శకత్వం ఇచ్చాను." అన్నారు సురేష్ అధినేత.

## వీరకాకాని విప్లవాత్మకం

వీరకాకాని పిక్చర్స్ అంతా కొత్తవాళ్లతో ఒక విప్లవాత్మక చిత్రాన్ని ప్రారంభించారు. ఈ చిత్రానికి లక్ష్మీదీపక్ దర్శకుడు. కథనుకూడా ఆయనే యిచ్చారు. మాటలను మద్దిపట్ల సూరి సమకూర్చారు. సంగీతాన్ని శంకర్, ఛాయను దేవరాజ్, కళను అనంతరావ్ నిర్వహిస్తున్నారు. నిర్మాత పేరు నారాయణరావు.

## రాజశ్రీ అదృష్టం రాఘవ ధైర్యం!

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ స్థాపించి, ఒక మేధావిని తెలుగుతెరకు దర్శకుడిగా పరిచయం చేశారు కె. రాఘవ. ఆ వ్యక్తి పేరు దాసరి నారాయణరావు. అదే వ్యక్తిచేత వరుసగా రెండు చిత్రాలను డైరెక్ట్ చేయించారు, రాఘవ. ఆ చిత్రాలు: "తాత—మనవడు, సంసారం—సాగరం."

గత వారం రాఘవ ఆఫీసులో రచయిత రాజశ్రీని చూశాను. వీరికి దర్శకత్వం యిచ్చాను అని చెప్పి, ఎదురుగావున్న నిర్మాతను (ఎం. కె. రాధా) వరి



"భారతి"లో కృష్ణంరాజు, జమున



"ఆడపిల్లల తండ్రి"లో
జయసుధ, పద్మప్రియ, నాగభూషణం

చయం చేశారు. రాజశ్రీని అభినందించి, రాఘవ ధైర్యాన్ని మెచ్చుకొన్నాను.

**రాజశ్రీకి అయిదు బాధ్యతలు !**

తమ సంస్థకు మురళీకృష్ణా మూవీస్ అను పేరును నిర్ణయించినట్టు, నిర్మాత రాధా చెప్పారు. ఈ సంస్థకు రాజశ్రీ పంచముఖుడిగా వ్యవహరిస్తారు. కథ, మాటలు, పాటలు, చిత్రానుకరణ + దర్శకత్వంను ఆయన చేపట్టడంవల్ల రాజశ్రీకి యీ పట్టం సరయినదని నేను భావిస్తున్నాను. రమేష్ సంగీతాన్ని, మధు ఛాయను, బాలు కూర్పును నిర్వహించే ఈ చిత్రంలో రాజబాబు నాయక పాత్రను పోషిస్తున్నారు. ముఖ్యభూమికలను జయంతి, గుమ్మడి, సత్యనారాయణ ధరిస్తారు. రాఘవ సమర్పించే మరొక సంచలనాత్మక చిత్రం యిది.

## సీతారామరాజు

ఈ చిత్రం విదేశీ చిత్రాలకన్నా గొప్పగా వచ్చింది. అలా రావడానికి కారకుడు వి. ఎస్. ఆర్. స్వామి. — ఒక విమర్శకుడు.

"ఇందులో కృష్ణ అద్భుతంగా నటించారు. ఒక కొత్త రూపం కనిపిస్తుంది. వీరావేశం ఆవహించిన ఆంధ్ర వీరుడిగా కృష్ణ సింహగర్జన చేశారు". — ఒక నటుడి పరిశీలన.

"రూధర్‌ఫర్డ్ దొరగా జగ్గయ్య ముమ్మూర్తులా తెల్లవాడిలాగా వుండడమేగాక, తెల్లవాడే ఆశ్చర్యపడే విధంగా ఆయన శోభించి నటించారు" — ఒక దర్శకుని తీర్పు.

"ఘంటం దొరగా గుమ్మడి ఘనంగా చేశారు. మల్లుదొరగా ప్రభాకరరెడ్డి ప్రతిభావంతంగా నటించారు. అగ్గిరాజుగా బాలయ్య భలేగా చేశారయ్యా"—



# సినిమా

ఈ మాటలు ఒక కవి నోటంట వచ్చాయి.

"ఇది మహారధి అపూర్వ సృష్టి. అతడి రచనా మహాత్మ్యం అద్వితీయం. ముఖ్యంగా పతాక సన్నివేశం త్రిపురనేని కలం బలాన్ని, ప్రేక్షకుల కన్నీళ్ల కాల్వలే కొలత వెయ్యాలి" — ఒక వుత్తమ నిర్మాత వాక్కు.

## కాబూలీ గెటప్‌లో రామారావు

శ్రీ భాస్కర చిత్ర నిర్మించిన "మనుషుల్లో దేవుడు" త్వరలో విడుదల అవుతుంది. "ధర్మ సంస్థాపనార్థాయా, సంభవామి యుగే యుగే" అంటూ మహావిష్ణువు అనేక అవతారాలు దాల్చి, పాపాన్ని నిర్మూలిస్తున్న విషయం మనకు తెలియనిది కాదు.

సంఘంలో మంచిని, మమతను పెంచడం కోసం, దుర్మార్గుల దురాగతాలను, అక్రమాలను అణచడం నిజమైన పౌర ధర్మం. మంచిని చెయ్యదలిచే వాళ్ళకు ఎన్నో యిబ్బందులు ఎదురవుతుంటాయి. వాటిని ఎదిరించి నిలబడినవాడే నిజమైన మానవుడు.

మమతను, మమకారాన్ని పెంచడమే తన విద్యుక్త ధర్మంగా భావించాడు మనుషుల్లో దేవుడు. దుష్ట శిక్షణ చెయ్యడానికి ఎన్నో వేషాలను వేశాడు. వాటిలో కాబూలీ వేషం ఒకటి. ఈ గెటప్‌లో రామారావు ఫక్తు కాబూలీవాలాగా కనిపిస్తారు.

"మనుషుల్లో దేవుడు" కథను నిర్మాత పుండరీ కాశయ్య వ్రాశారు. కథకు జీవం నాయకుని వేషం. నటరత్న నూరు శాతం న్యాయం చేశారు ఆ వేషానికి. ఆయనకు వాణిశ్రీ, సరోజాదేవి, అంజలీదేవి, విజయలలిత, వరలక్ష్మి, రత్న, కృష్ణంరాజు, గుమ్మడి, ధూళిపాళ, రామదాసు, రాజబాబు, రామమోహన్, ఫణి చక్రవర్తి, భువనేశ్వరి సహపాత్రధారులు. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు.

"ముగ్గురు అమ్మాయిలు"లో రంగారావు



## త్రివేణిలో రెండు చిత్రాలు

"బడి పంతులు" చిత్రాన్ని అందించిన త్రివేణి పేరాజు ఒకేసారి రెండు చిత్రాలకు అంకురార్పణ చెయ్యబోతున్నారు. రెండూ రామారావు నాయకత్వంలో జరుగుతాయి. రెండూ రంగులలో నిర్మితమవుతాయి. ఒక చిత్రానికి ఏ. భీమ్‌సింగ్ దర్శకుడు. మరొకదానికి ఆదుర్తి నిర్దేశకుడు. రామారావు – ఆదుర్తి కలిసి కొన్నేండ్లు అయింది.

## ఆదుర్తి చిత్రంలో కొత్త అమ్మాయి

"మాయదారి మల్లిగాడు" చిత్రాన్ని నిర్మించిన రవి కళామందిర్ యిప్పుడు "మట్టి గాజులు" చిత్రాన్ని తలపెట్టింది. కథ, సినిమానువాదం, దర్శకత్వంను ఆదుర్తి చేపట్టారు. చిరంజీవి సత్యానంద్ సంభాషణలను వ్రాశారు. సంగీతాన్ని మహదేవన్, ఛాయను రామకృష్ణ, కళను తోట, కూర్పును హరినాథ్ నిర్వహిస్తున్నారు.

నాయక పాత్రను కృష్ణ పోషించే యీ చిత్రంలో నాయిక వేషాన్ని ఒక కొత్తమ్మాయికి యిచ్చారు, ఆదుర్తి. ఆమె పేరులో ముస్లిమ్ శబ్దం వున్నది. కానీ తెలుగు ఆమెకు అనర్గళంగా వచ్చు. పూనా ఫిలిం సంస్థ అందించిన ఆణిముత్యం యీ జరీనా.

## సత్యానికి సంకెళ్ళు

లక్ష్మి చిత్ర నిర్మిస్తున్న యీ చిత్రాన్ని (రషస్) యిటీవల చూడడం జరిగింది. పది రీళ్ల చిత్రం చూశాను. నాకు వాణిశ్రీ, దర్శకుడు ప్రకాశరావు తప్ప మరొకరు కనిపించలేదు. నీతిగా, నిజాయితీగా బ్రతికే పనిమనిషి లక్ష్మిగా వాణిశ్రీ నటిస్తూవుంటే, నేను ఎంతగా కన్నీరు కార్చానో చెప్పడం కష్టం. నమ్ముకున్న సత్యానికి అన్యాయం జరిగినప్పుడు, అతడ్ని విడిపించమని తన యజమాని



''సత్యానికి సంకెళ్లు''లో ఒక సన్నివేశం

దగ్గర ప్రాధేయపడినప్పుడు, అయ్యో పాపం అని సానుభూతి చూపించే విధంగా వాణిశ్రీ నటించింది. జైలుశిక్ష పడకుండా వుండడానికి ఒక్క అబద్ధం చెప్పు అని సత్యాన్ని ప్రార్థించిన ఘట్టంలో, ఆమెపై జాలి జనిస్తుంది. యజమాని నిజ స్వరూపం తెలిసినప్పుడు, ఆమె ఆవేశంతో, ఆవేదనతో కుమిలినప్పుడు రాతి గుండెకూడా కరిగిపోతుంది. సత్యాన్ని ప్రతిక్షణం స్మరిస్తూ దారిన వచ్చేవాళ్లను సత్యంగా భ్రమించి, మోసపోయిన ఘట్టంలో వాణిశ్రీ అసాధారణంగా నటించింది. వాణిశ్రీకి 'ఊర్వశి' నివ్వగల పాత్ర యిది. ప్రేక్షకులు కలకాలం మెచ్చుకునే పాత్ర యిది. ఇన్ని ఉదాత్త దృశ్యాలను జొప్పించిన దర్శకుడు ప్రకాశరావును అభినందించకపోతే ఎలా ? ఈ చిత్రానికి కథను దర్శకుడే వ్రాశారు. కథకు నాయకుడు సత్యం. ఆ వేషానికి న్యాయం చేశారు కృష్ణ. సహాయ పాత్రలను రాజబాబు, సత్యనారాయణ, చంద్రమోహన్, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, శుభ, నిర్మల పోషిస్తున్న ఈ చిత్రాన్ని పి. ఏకాంబరం, రామకృష్ణారావు నిర్మిస్తున్నారు.

### వాణిశ్రీకి డిమాండు

ఆంధ్రుల అగ్రనటి వాణిశ్రీకి విపరీతమైన డిమాండు వున్నది. ప్రతి నిర్మాతకు ఆమె కాల్ షీట్లు ఎలా యివ్వగలదు? తనకు కథ నచ్చి, అందులో తన పాత్ర ప్రజలకు నచ్చేదిగా వుంటేనే, ఆమె అంగీకరిస్తుంది. నాకు తెలిసి ఆమె యిరవై నిర్మాతలకు ''నో'' అని చెప్పింది. ఇప్పుడామె ధరిస్తున్న ప్రతి వేషం ప్రేక్షకుల ప్రశంసలను అందుకోవడం తథ్యం.

పేరులో లక్ష్మి, సరస్వతులు వున్నట్టే, రూపంలో గ్లామరు + నటనాశక్తి ఆమెకు ఉన్నాయి. అందుకే ఏదేని మంచి నవల కొన్నప్పుడుగాని, మంచి పాత్ర వున్నప్పుడుగాని వాణిశ్రీ మెదడులో మెదలుతుంది.

### ప్రజల కోరిక !

తెలుగుతెర నాయకు లందరితో వాణిశ్రీకి చిత్రాలు వున్నాయి, ఒక్క నాగేశ్వరరావుతో తప్ప. ఆయనతో వాణిశ్రీ సంవత్సరానికి ఒక చిత్రమైనా ఒప్పుకోవాలి. ఇది ప్రజల కోరిక. ఒకప్పుడు ఆయనతో మాత్రమే చిత్రాలు వచ్చాయి. అవీ వరుసగా విడుదల గావడంవల్లా, అన్నిట్లో అక్కినేని, వాణిశ్రీలేనా అన్న భావం జనించింది. కానీ యిప్పుడు యిద్దరూ ఒక చిత్రంలోనైనా కనిపించాలి అన్న ఆశ ప్రేక్షకులకు ఏర్పడింది.

## కృష్ణంరాజు-కాంచన!

మన ఆయిదవ హీరో, యిప్పుడున్న కథానాయిక లందరితో నటిస్తున్న విషయం పాఠకులకు తెలుసు. వాణిశ్రీ, శారద, జమున, విజయలలిత, భారతి, కాంచన ఆయనకు జంటగా నటిస్తున్నారు.

కృష్ణంరాజు, కాంచన ప్రధాన పాత్రలను పోషిస్తున్న చిత్రాన్ని కె. హేమాంబరధరరావు నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో కృష్ణంరాజు, చంద్రమోహన్ ప్రాణస్నేహితులుగా నటిస్తున్నారు. చంద్రమోహన్ భార్యగా లక్ష్మి నటిస్తున్నది. ఈ చిత్రానికి ''అంతం చూసిన అనూయ'' నవల ఆధారం. కథానాయికగా జమున కరుణరస ప్రధానమైన పాత్రను పోషిస్తున్నది. ఆమె ప్రక్కన రంగారావు అనే కొత్తనటుడు నటించడానికి ఆమె ఎలాంటి అభ్యంతరము చెప్పలేదు. ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను వ్రాశారు. చలపతిరావు సంగీతాన్ని, శేఖర్-సింగ్ ఛాయను, బి. జి. కూర్పును, బి. ఎన్. కృష్ణ కళను, మహేంద్ర ప్రొడక్షన్ను చేపట్టారు. ముఖ్య హాస్యభూమికను రాజబాబు ధరిస్తున్న ఈ చిత్రానికి హేమాంబరధరరావు నిర్మాత. ఈ చిత్రాన్ని ఎక్కువ ఖర్చుపెట్టి, ప్రజాదరణ వున్న నటీనటులను పెట్టి నిర్మిస్తున్నారు. సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్‌లో యింతమంది నటీనటులు వుండడం యిదే ప్రథమం.

### కాంచనలో లోపం ?

సుభాషిణీ సెట్లో కాంచనను కలిసినప్పుడు,



''మనుషుల్లో దేవుడు''లో ఎన్.టి.ఆర్.



''అల్లూరి సీతారామరాజు'' లో ఒక దృశ్యం

ఆమె నొక ప్రశ్న అడిగాను. మీరు ఎక్కువ చిత్రాలలో నటించకపోవడానికి కారణం చెప్పగలరా అని. ఆమె చెప్పిన సమాధానం విని విస్తుపోయాను.

వాంప్ పాత్రలకు, అత్త పాత్రలకు ఆమెను మన నిర్మాతలు అడుగుతున్నారట. చూశారా మన చిత్ర వ్యక్తుల వింత ప్రవర్తన ఒకప్పుడు కాంచన నాగేశ్వరరావు, రామారావు, శోభన్‌బాబు, కృష్ణలతో నాయికగా నటించిన విజాన్ని మనవాళ్ళు మరిచి పోయారా ? అయినా ఆమె కేం లోపమని, యిలాంటి పాత్రలు పోషించడానికి ? ఆమెకూ ఒక రోజంటూ రాకపోదు. అప్పుడు ఆమె సత్తా ఏమిటో తెలియ వస్తుంది.

ఆమెకు అందం తక్కువా ? నటన తక్కువా ? వాచికం తక్కువా ? అభినయం తక్కువా ? లేక వయస్సు ఎక్కువా ? ఆమెకు అన్నీ వుండికూడా, నిర్మాతల దృష్టి వక్రించిందంటే, ఏమని ఆలోచించాలో అర్థం గావడంలేదు.

భక్త తుకారామ్‌లో ఆమె ధరించినది విల్లి వేషమా ? దేవుడు చేసిన మనుషులులో ఆవిడ చేపట్టినది చెడు వేషమా ? ఆ పాత్రల స్వభావాన్ని అర్థం చేసుకున్న వాళ్ళకి మాత్రమే తెలుస్తుంది, అవి మంచి పాత్రలని.

# సినిమా

## అత్తా కోడళ్ల డ్యూయెట్

ప్రేయసీ ప్రియులు, భార్యా భర్తలు యుగళ గీతాలు పాడడం, మన చిత్రాలలో చూస్తూ వున్నాము. అత్తా కోడలు డ్యూయెట్ పాడడాన్ని మనం చూడబోతున్నాము. ఈ విచిత్ర సంఘటన దేవీ ప్రియదర్శిని పిక్చర్స్‌వారి ''హారతి'' చిత్రంలో కనిపిస్తుంది. అత్తగా పుష్పలత, కోడలుగా భారతి నటిస్తున్నారు. అత్తకు భర్తగా జగ్గయ్య, కోడలికి నాథుడిగా కృష్ణంరాజు నటిస్తున్న యీ చిత్రానికి శారద కథానాయిక. 'హారతి' కథను కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాశారు. సంగీతాన్ని చక్రవర్తి, ఛాయను శేఖర్—సింగ్, కళను బి. ఎస్. కృష్ణ నిర్వహిస్తున్నారు. చిత్రానుకరణ, దర్శకత్వంను పి. లక్ష్మీదీపక్ చేపట్టారు. ముఖ్య పాత్రలను రాజబాబు, రమాప్రభ, పద్మనాభం, ప్రసన్నరాణి, అల్లు రామలింగయ్య, మరియు నాగభూషణం పోషిస్తున్నారు. నిర్మాతలు : శేఖర్ అండ్ బండి కృష్ణారావు.

''శారద'' చిత్రం తరువాత, చక్రవర్తి సంగీతం నూరు శాతం 'హారతి' పాటలకు న్యాయం చేకూర్చింది అని నేను చెప్పగలను. నేను చిత్రంలోని అయిదు పాటలను విన్నాను. అందులో నాలుగు మరీ బాగున్నాయి అని చెప్పక తప్పదు.

## బి. డి. వో. గా కృష్ణ !

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ నిర్మించిన ''గౌరి'' చిత్రంలో కృష్ణ బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగా నటించారు. గ్రామంలో జరిగే దురాచారాన్ని, దుర్మార్గాన్ని దూరంచేసి న్యాయాన్ని, ధర్మాన్ని పరిరక్షించిన మంచి మనిషిగా, నిజాయితీవున్న ఉద్యోగిగా కృష్ణ హుందాగా నటించారు బి. డి. ఓ. పాత్రను. వృత్తికోసం ఆఫీసరుగా వచ్చాడు; ప్రజలందరికి నచ్చినవాడైనాడు; దుష్టత్రయం పగబట్టి అతన్ని కబళించారు.

భర్తను పొట్టన బెట్టుకొన్న ముగ్గురి మూర్ఖులను హతమార్చడానికి ప్రతినబూని, తన పని పూర్తిచేసుకొనింది గౌరి. ప్రారంభంలో చిలిపి పిల్లగా, తరువాత ఆదర్శ గృహిణిగా, చివరికి రుద్రకాళిగా జమున వైవిధ్యమైన నటనను చూపెట్టి, చిత్రాన్ని తనే నడిపించి, రాణింపు తీసుకొచ్చింది. 'గౌరి' కథను నిర్మాత సుబ్బరాజు వ్రాయ, మాటలను మహారథి రచించారు. దుష్టత్రయంగా సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు నటించారు. రాజబాబు, రమాప్రభ రిలీఫ్‌కి వుండనేవుండె. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## చక్రవాకంలో ఆరు జంటలు

సురేష్ మూవీస్ ''చక్రవాకం'' కలర్ చిత్రాన్ని ప్రారంభించింది. ఒక షెడ్యూలు పూర్తయింది. శోభన్, వాణిశ్రీ, చంద్రకళ, కె. వి. చలం తో



లలితకళా నికేతన్, రాజమండ్రిలో జరిగిన నాటకపోటీలలో ఉత్తమ నటుడు, దర్శకుడు బహుమతులని, హిందీనటుడు రాజకపూర్ ఏర్పాటు చేసిన ఉత్తమ క్యారెక్టర్ నటుడి బహుమతిని అందుకున్న శ్రీ రావూజీ.



"పండంటి సంసారం"లో భానుమతి, గుమ్మడి

షెడ్యూలులో పాల్గొన్నారు. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, వి. మధుసూదనరావు, మార్కస్‌బార్ట్లే, కృష్ణారావు, మార్తాండ్ సారధులు. దీనిని ఒక అపూర్వ చిత్రంగా రూపొందించడానికి రామానాయుడు ప్రతినబూనారు.

'చక్రవాకం' కథలో వి. ఆరు జంటలుగా శోభన్—వాణిశ్రీ; రంగారావు—అంజలీదేవి; చంద్రకళ—శ్రీధర్; నాగభూషణం — జి. వరలక్ష్మి; పద్మనాభం—రాజసులోచన; కృష్ణకుమారి — ? నటిస్తున్నారు. హాస్యానికి కె. వి. చలం, అల్లు రామలింగయ్య వున్నారు.

అలవాటు

సురేష్ రామానాయుడికి తను నిర్మించే ప్రతి చిత్రంలో ఏదేని ఒక వేషం వెయ్యడం అలవాటు. చక్రవాకంలో కృష్ణకుమారికి భర్తగా నటించవచ్చు. తమ నిర్మించే ప్రతి చిత్రానికి కుమారుడు చిరంజీవి సురేష్ చేత స్విచ్ ఆన్ చేయించడం, ప్రముఖ నిర్మాత నాగిరెడ్డి చేత క్లాప్ కొట్టించడం నాయుడికి అలవాటు.

## పూలపిల్లగా జమున!

పద్మజా మూవీస్ నిర్మిస్తున్న "దీక్ష" చిత్రంలో పూలమ్మే పిల్లగా జమున నటించిన దృశ్యాన్ని యిటీవల మహాబలిపురం వద్ద చిత్రీకరించారు. హీరో రామారావును వుద్దేశించి, ఆయన మనసును దోచుకోవడం కోసం పూలమ్మే పిల్ల వేషాన్ని జమున ధరించింది. "మనసు-మాంగల్యం" నిర్మాత కె. కుటుంబరావు 'దీక్ష' చిత్రాన్ని ప్రేక్షకు

**సినిమా**

లను ఆకట్టుకునే విధంగా నిర్మిస్తున్నారు. ప్రత్యేకతను ప్రతి చిత్రంలో కనపరిచే ప్రత్యగాత్మ 'దీక్ష' ను ఒక హిట్ చిత్రంగా రూపొందిస్తున్నారు.

## నటుడైన నిర్మాత కుమారుడు

గోపాలకృష్ణ ప్రొడక్షన్స్‌వారి చిత్రం షూటింగు ప్రారంభమై, ఏడు రోజులు ప్రసాద్‌లో జరిగింది. కృష్ణ, జమున, ప్రభాకరరెడ్డి, రమాప్రభ, బాబురావు పాల్గొన్నారు. ఈ షెడ్యూలులో నిర్మాత కుమారుడు చిరంజీవి వాసు ఒక బుల్లి పాత్రను పోషించాడు. కె. గోపాలకృష్ణ నిర్మిస్తున్న యీ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకుడు.

## జమునకు రక్త తిలకం!

ఇటీవల జమునయింట్లో ఒక విచిత్రసంఘటన సంభవించింది. ఇరవై ఏండ్ల ప్రాయం వున్న కుర్రాడు ఆమెను చూడడానికి వచ్చాడు. ఆమెను చూడగానే, ఆమె పాదాలకు నమస్కరించాడు. దాంతో ఆగక, తన చేతి వ్రేలిని కోసి, వచ్చిన రక్తాన్ని జమున నుదుట తిలకంగా దిద్దాడు. ఆమె నటించిన చిత్రాలలోని బొమ్మలను ఆల్బంగా తయారుచేసి, ఆ బొమ్మల నుదుట రక్త తిలకం దిద్దిన వైనాన్ని ఆమెకు చూపించాడు. అతడి అభిమానాన్ని చూచి ఆమె ఆశ్చర్యపోయింది. పెద్ద సైజు ఫోటో నొకదానిని అతనికి బహుమతిగా యిచ్చింది. అతడి కళ్ళు ఆనంద బాష్పాలతో చెమ్మగిల్లాయి.

-శ్రీనివాస్

"గాలిపటాలు"లో ఒక సన్నివేశం



కుంటి రత్నం బృందంలోంచి అందరూ తన వెనక నవ్వుతున్నట్టు అనిపించింది.

"నవ్వుతారు — నవ్వకేం ? — టెంకాయ తింటూ నవ్వుతారు — నవ్వి చావనీ — తిని చావనీ — చావనీ —" అని తిట్టుకుంటూ ముందుకే నడిచింది గౌరి.

ముందుకు మూడడుగులు నడిచిన గౌరి ముందు ఎవరో వచ్చి ఆగేరు.

ఎవరు ?

తలెత్తి చూసింది గౌరి —

గుడ్డి గంగి !

"నువ్వా ! — ఎక్కడి కెళ్ళేవే ఇంతసేపూ ? —" అని అడిగింది గౌరి.

వొగురుస్తోంది గంగి. ఎక్కడి కెళ్ళేనో తర్వాత చెప్తాను — అంటున్నట్టు రెప్పలు తేలుస్తూ వొగురుస్తూ చూసి, ఇప్పుడు నే చెప్పేది విను — అంటున్నట్టు. వొగర్పును అణగబెట్టుకుంటూ అంది — "పెద్ద బజార్లో పూజ... జరుగుతోంది. . పెద్ద అంగడి — కొత్త .. కొత్త అంగడి — రా. . పోదాం రా. . ఊ... తొం—దరగా — పద — దిష్టికాయలు కొడతారు — రా — పరుగెత్తు—రత్నానికి చెప్పొద్దు— పద—పరుగెత్తు..." అంది

ఆ మాటలు విన్న గౌరి కళ్ళు ఆ చీకట్లో ఒక్కసారిగా వెలిగేయి. ఆ వెలుగులన్నీ ఆ పిల్ల కళ్ళలోంచి మెరుపులుగా చిమ్మేయి.

"నిజంగా !—నిజంగానే ! ? !—" అంది గౌరి—

"ఒట్టు — రా పోదాం—ఈ పక్కనే—రెండో రోడ్డు—"

"సరే—పద—"

మరుసటి క్షణంలో రయ్యిమని పరుగెడుతోంది గుడ్డిగంగి. ఆ వెనకే కాలికొద్దీ పరుగు తీస్తోంది గౌరి. రోడ్డు, ప్లాటుఫారమూ — కాళ్ళ కింద వెనక్కి జరిగిపోయేక, ప్రక్క ప్రక్కల దీపాల భూతాల్లాంటి షాపులెన్నో వెనక్కి వెనక్కి వెళ్ళి పోయేక — అప్పుడు గంగితోబాటు ఆగింది గౌరి.

మెయిన్ బజార్లో రద్దీ చాలా ఎక్కువగా వుంది

అక్కడ ఆ షాపు ఆరోజే తెరిచేరు. అది ఒక పెద్ద జనరల్ స్టోరు. దాదాపు ఒక సినిమా హాలంత వుంది. సరికొత్త షాపు కాబట్టి అక్కడ జనం విపరీతంగా వున్నారు.

లౌడ్ స్పీకర్లోంచి సినిమా పాటలు వినిపిస్తున్నాయి. (ఏదో పెళ్ళి పాట కాబోలు వస్తోంది — కాని, ఎందుకో ఆ పాట వింటే ఏడుపు వచ్చేలా వుంది.)

ఆ షాపుముందు వేసిన పందిరి పెళ్ళిపందిరిలా వుంది.

అక్కడ హడావుడి అంతా చూస్తుంటే అక్కడేదో యజ్ఞం జరుగుతూన్నట్టుగానో, జరగబోతూన్నట్టుగానో వుంది.

"ఒకటీకాదు — రెండూకాదు — మూడు కాయలు కొడతార్ట — మూడుకాయలు !—" అంది గుడ్డిగంగి కళ్ళు యింకా పెద్దవిచేసి తిప్పుతూ—

## దిష్టికాయ

(23వ పేజీ తరువాయి)

'నిజంగా !—" అంది గౌరి.

"ఔను — కొత్తంగడి కదా — కొడతారు — తప్పకుండా మూడు కాయలు—మూడు కాయలు—"

'మూడు కాయలు' అని పారవశ్యంగా మళ్ళీ అంటోంది గుడ్డిగంగి. అంటూనే చప్పున ఒక సందేహంలో పడింది. "ఔనూ — మన మొచ్చేమని కుంటికూడా ఒచ్చేస్తే !—" అంది.

"ఔను—ఒచ్చేస్తే ! ? —" అనుకుంది గౌరి.

అనుకుంటూ తాము వచ్చిన దారివేపు చూసుకుంది.

కుంటి బృందం రావడంలేదు. "రార్లే !—" అనుకుంది గౌరి. "కాని వచ్చేస్తే !—" అనికూడా అనుకుంది. "వాళ్ళు వచ్చేలోగా ఇక్కడ కాయలు కొట్టేస్తే ! —"

"అదుగో — అదుగో — కాయలు—"

అంటూ అరుస్తూ చూపించింది గంగి

ఆత్రంగా చూసింది గౌరి

కర్పూరాలు వెలుగుతుండగా కాయల్ని దిగదీసి తిప్పుతున్నారు లావుగా నల్లగా వున్నవాడి వెనక ఒకడు ఒక పళ్ళెంలో మూడు దిష్టి టెంకాయలోస్తు వస్తున్నాడు.

నల్లవాడు ప్లాటుఫారమ్మీదికి వచ్చేసరికి ఊపిరి బిగబట్టింది గౌరి.

"ఏది ఏమైనాసరే — ఆ ముక్కలన్నీ నేనే ఏరుకోవాలి — అన్నీ — అన్నీ — ఎత్తేసుకోవాలి—" అని పళ్ళు బిగబట్టి అనుకుంది.

నల్లవాడు కొబ్బరికాయను పందిరి దగ్గర కూడా దిగదీసి—ప్లాటుఫాం అంచున నిలబడి చెయ్యి పైకెత్తేడు.

"ఆట్టే పోటీకూడా లేదు — ఈ కాయంతా నాదే కావాలి—" అనుకుని — కాయ పగిలితే ఉరకడానికి తయారుగా వంగి నిలుచుంది గౌరి

అంతలో —

"కుంటి దొస్తోంది—కుంటిది — కుంటిది—" అంది గంగి కేకలుపెడుతూ

తలెత్తి చూసింది గౌరి. కుంటిదాని బృందం శరవేగాన వస్తూ అల్లంతదూరాన కనిపించింది.

గంగి గుండెలు తొందర తొందరగా కొట్టుకున్నాయి. నల్లవాడి కళ్ళవేపు చూస్తూ చురుకుదనం కూడదీసుకుంది.

నల్లవాడు ఒక్క ఉదుటున టెంకాయని ఠపీమనిపించేడు

గౌరి కళ్ళు మెరుపుల్లా మెరిసేయి

పగిలిన టెంకాయ ఎగిరి

ఎక్కడ పడింది ?

సరీగ్గా రోడ్డు మధ్యన పడింది.

షాపు దగ్గర కొచ్చేసిన రత్నంకూడా ఒక్క ఉదుటున ప్లాటుఫారం దిగేసి రోడ్డుమీద కొచ్చింది.

రత్నం రోడ్డుమీదకు రావడం చూసి వంగున్నది వంగున్నట్టే బాణంలా దూసుకుని రోడ్డు మధ్యకి ఉరికింది గౌరి

అంతే ! —

రోడ్డు మధ్యన ఠపీమని టెంకాయ కొట్టిన శబ్దం వినిపించింది.

"గౌరీ !!—" అని అరిచింది గంగి —

"అమ్మాయ్ — అమ్మాయ్ — అమ్మా —" అంటూ అరిచి ఇక అరవడం ఆపి నిర్ఘాంతపోయేడు టెంకాయ కొట్టిన నల్లవాడు.

ట్రాఫిక్ ఎక్కడిదక్కడ బంద్ అయిపోయింది

జనం గుమిగూడేరు

పోలీసులు విజిళ్ళు వేసుకుంటూ వచ్చేరు.

అందమైన భూతంలాంటి నల్లకారు కింద లేత రక్తం మడుగై గడ్డకట్టింది.

కారు ముందు బంపర్‌కి వ్రేళ్ళాడుతోన్న పసుపుపచ్చటి నిమ్మకాయలమీద కూడా ఆ రక్తం ఎర్రగా మెరిసింది

గుడిసె గుమ్మానికి తలకొట్టుకుని గౌరి తల్లి నుదుటిమీద వికృతంగా బొప్పికట్టింది !



# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

**పి. పి. షాద్‌నగర్.**

స్త్రీకి మాంగల్యం, శీలం ఈ రెండిటిలో ఏది ముఖ్యం?

మీ ప్రశ్న చూస్తే మహా చిరాకు. ఏం రెండూ ముఖ్యం అని మీ కెందుకు తోచలేదు? మాంగల్యం అంటే మీ ఉద్దేశ్యం 'పెళ్లి అయిన' అనేకదూ?

**ఎస్. ఎమ్. ఎస్. హైదరాబాదు.**

నేను ఉద్యోగం చేస్తున్నాను ఒక అమ్మాయిని ప్రేమించాను మా శాఖలు వేరు. మా తల్లిదండ్రులకు అభ్యంతరం లేదు కాని అమ్మాయి వాళ్లకి.

నిజమే— ఈ రోజుల్లో— తల్లి తండ్రులు. తల్లి తండ్రుల్లా వుండడం లేదు. కొన్ని సందర్భాలలో— 'అమ్మాయి యింకా రెండేళ్లు సంపాదించనీ, తరువాత పెళ్లి సంగతి చూసుకోవచ్చు' అన్న ధోరణిలో వుంటున్నారు!. మీరిద్దరూ మేజర్లయితే మీ సంపాదన మీద మీరు బ్రతగ్గలమన్న ధైర్యం వుంటే— మీలో మీకు ఆత్మవిశ్వాసం వుంటే హాయిగా తెగించండి

**కె. వి. ఆర్. కాట్రావులపల్లి.**

డబ్బు లేక పోతే యీ లోకంలో మనిషి మనుగడ అసాధ్యమా?

అసాధ్యం కాదు— కాని సుఖప్రదం మాత్రం కాదు.

**వి ఆర్.ఆర్. బెంగుళూరు.**

మీరు మగవాళ్లను అనుక్షణం దెప్పి పొడుస్తూ వుంటారు

అంకుశం వుంటే గాని ఏనుగు లొంగదు. ఏం చెయ్యను చెప్పండి. అలా పొడవగా పొడవగానైనా ఆడది ఉనికికి గౌరవం యివ్వాలని— మీ బుర్రకి తడుతుందేమో నన్న చిరు ఆశ నన్నొగ్గిడం లేదు— నాలో

**ఎస్. జె ఆర్. రామరాజపల్లె**

మనిషికి డబ్బు అంటే ఆశ ఎందుకు? ఆ డబ్బాశతో— ఉన్నది కూడా పోగొట్టుకుంటారెందుకు?

అదే ఆశలో వున్న బలం ఆశకి సంతృప్తి లేదు. వస్తుందేమో అన్న ఆశలో, వున్నది పోగొట్టుకుంటారు. వస్తే— యింకా కావాలనీ ప్రయత్నిస్తారు. అది నైజం

**ఎస్ ఎస్ ఆర్ విశాఖపట్నం.**

కోరనిదే సహాయం చేస్తే, ఎదుటి వ్యక్తి ఏమనుకుంటాడండి?

'నిన్నొడిగాడయ్యా, బోడి సహాయ్'— అంటాడు. అందుకే కోరక సహాయ్— ఎప్పుడూ దండుగ!

**ఎస్. ఆర్ తాళ్లపొద్దుటూరు**

నాకు ఇద్దరు ప్రాణమిత్రులున్నారు ఒకడు ప్రశ్నావళి చూస్తే అగ్గి గుగ్గి ఐపోయి చింపి కాల్చి కసి వెళ్లబెట్టుకు తిరుగుతాడు. ఇంకోడు కాగితం చింపి టిఫిన్ చేసి చల్లగా తింటాడు. ఈ ఇద్దరినీ ఏం చెయ్యాలి?

కాఫీ కాచుకుంటే ఏం బాధ లేదు కాని— తినే? వాడు జాగ్రత్త రంగయ్యగారూ, న్యూస్‌ప్రింటు అరుగుతుందో లేదో అని భయంగా వుంది!!

**పి ఎమ్ సిహెచ్ పామరు.**

నేను మెట్రిక్ చదువుతూ అదే క్లాసు అమ్మాయిని ప్రేమించాను

సిల్లీ, మెట్రిక్ చదివి— ఎప్పటికి పాస్ అవుతారు? ముందా సంగతి తేల్చుకో— చిట్టితమ్ముడూ ప్రేమించడానికి చాలా టైముంది నీకు

**టి. డి. ఆర్. కుర్నూపర్ (భిలాయి).**

డియర్ సిస్టర్— తినటానికుంటే తిండి లేదు చదువుతామంటే డబ్బులేదు. ఈ పరిస్థితులకు కారణం సమాజమా? అదృష్టమా?

ఏదీ కాదు— ప్రభుత్వంలో, అధికారంలో ఉన్న వారి— చిన్న చూపు, స్వార్థం.

**కె. సి. ఆర్. కోరుట్ల.**

మానవుని ఆశయాలకు గమ్యస్థానం ఏది?

ఏదో ఒక గమ్యం పెట్టుకునే— ఆశయాలు దానికి తగిలిస్తాడు మానవుడు— మానవుని ప్రయత్నాన్ని పట్టి, మానసిక బలాన్ని పట్టి, — కలిసి రావడాన్ని బట్టి— ఆశయాలు నెరవేరుతూ వుండడమో— వే కొరుగుతూ వుండడమో జరుగుతూ వుంటుంది.

**ఎమ్ ఎల్ ఖమ్మం.**

బాధ్యతారహితంగా నానాటికి దిగజారిపోతున్న నేటి యువతరం పై మీ అభిప్రాయం?

యువతరాన్ని మనమే దిగజార్చేస్తున్నాం. మనం ఏమిచ్చాం కనుక— వారు ఉత్సాహంగా ముందుకి వురకడానికి?

**పి.ఎల్ ఎమ్. శ్రీముఖలింగం.**

మనిషికి మనసు అన్నది— ఎక్కడ వుంటుందండి?

చేతల్లో— మాటల్లో— అతని ప్రవర్తన అంతటా అంతర్లీనంగా అతని మనసు వ్యాపించి వుంటుంది.

**పి. ఎస్. ఆర్. కొత్తగూడెం.**

జీవితంలో అన్నిటికంటే విలువైనది ఏది?

కాలం. వో క్షణం జారి పోయినా కూడ గట్టుకోలేం. మనం శాశ్వతం అనుకునే సుఖసంతోషాలు మన కళ్లముందే నీడల్లా కదలి వెళ్లి పోతాయి.



## పూలరేకులు, నీలి బాకులు — పి. ఎస్. గోపాల్.

ఒక స్నేహితుని కళ్ళు
కలువరేకుల్లా చల్లదనాన్నిస్తాయ్
ఒక పరిచయస్తుని కళ్ళు
తులువవాలుకళ్లా మంటల్ని రేపుతై!
ఒక స్నేహితుని మాటలు
చంద్రుని వెన్నెల్లా చల్లదనాన్ని
వర్షిస్తాయ్!
ఒక పరిచయస్తుని మాటలు
కలహకంఠి పలుకుల్లా గరళాన్ని
చిందుతై!
ఒక స్నేహితుని తలపులు
కర్పూరపు పలుకుల్లా మధుర
స్మృతులను మేల్కొల్పుతాయి
ఒక పరిచయస్తుని తలపులు
విషపుములుకుల్లా గుండెల్లో
కలుక్కుమంటాయి!
ఒక స్నేహితుడు రేరాజు!
వేరొక్కడు రారాజు!
ఒక స్నేహితుడు అమృతాన్నిస్తాడు
వేరొకడు మృతిని కొనివస్తాడు!
ఒకని సహవాసం శాంతినివాసం
వేరొకని పరిచయం పిశాచాలకావాసం!
అందుకే అప్రమత్తుడవై
ప్రాణమిత్రుల నెన్నుకో,
అందుకే అందమైన నీజీవితాన్ని సరిదిద్దుకో
ఘూకాలకీ, రాకాసులకీ
చొరరాని స్నేహవలయాన్ని నిర్మిం
చుకో—
ఏ కాలంలోనైనా రాకాసులతత్వంఒకటే
నమ్మించి ద్రోహంచేసే నిశాచరులాకాలం
లోనూ వున్నారు!
ఈ కాలంలోనూ ఉన్నారు!
నల్లనివన్నీ నీళ్లని నమ్మకు!
తెల్లనివన్నీ పాలైతే జగతిలో కావల
సినదేముంది ?
నీ అంతరాంతరాలలోని చంద్రశిలా
వితర్దిక
నీహారబిందువులను చిందే మంచి
హృదయం
నీకు లభించక పోదులే!
అంతదాకా నీకు తపస్సు తప్పదు·
ఆ శుభఘడియనిచ్చే ఉషస్సు రాకతప్పదు!



ఉప్పు-నిప్పులా అవుతారు. నా మాట విను! యింటికి పోదాంరా!''

''వుండు మామయ్యా! ఒక్కసారి ఆయన్ని పలకరించివస్తాను.''

''అయితే నీఖర్మ! వెళ్లు. సరేగానీ—నీపని అయిన తర్వాత యింటికి రావటం మర్చిపోకు. నువ్వు భోజనానికి వస్తానన్నావని రాధకి చెబుతాను.'' అనేసి వెళ్లిపోయాడు

రవి స్ప్రింగ్‌డోర్ తెరుచుకుని, లోపల అడుగుపెట్టేముందు ఒక్కక్షణం ఆగి కాలర్ సవరించుకున్నాడు!

స్ప్రింగ్‌డోర్ వెనక తటపటాయిస్తున్న పాదాలు చూసి, ఆఫీసరుగారు చిరాకుతో, 'కమిన్!' అని అరిచాడు.

రవి లోపలికి వచ్చాడు.

కుర్చీలో కూర్చుని వున్న ఆయన, గుమ్మం దాటి లోపల అడుగు పెట్టిన రవి, యిద్దరూ ఒకరిని ఒకరు క్షణంసేపు చూపులతోనే కొలుచుకున్నారు.

''యూ ఆర్ మిస్టర్ రవికుమార్!'' ఆయన చూపులు అతన్ని నఖశిఖపర్యంతం పరీక్షించినాయి.

''యస్ సార్!''అతని జవాబులో వినయం కంటే హుందా తనమే ఎక్కువగా వుంది.

''ఎనీ ప్రీవియస్ ఎక్స్‌పీరియన్సెస్?''

''నో!''

రవి యిచ్చిన సర్టిఫికెట్లు అందుకుని, పరిశీలనగా చూస్తున్న ఆయన, తల సాంతం ఎత్తకుండానే, రవినికూర్చోమని సైగచేసాడు కానీ రవి కూర్చోలేదు.

రవి సర్టిఫికెట్లు చూసినకొద్దీ ఆయన ముఖంలో సంభ్రమాశ్చర్యాలు తొణికిస లాడినాయి!

మధ్యలో తలెత్తి, రవిని, సర్టిఫికెట్లనీ మార్చిమార్చి చూసారు! కానీ ఆయన ముఖంలో ప్రసన్నత రెప్పపాటులో మాయమైంది! కఠినంగా చూస్తూ, ''ఏమయ్యా! నీకేమైనా మతివుందా?'' అన్నాడు రవి నిటారుగా అయాడు

''బి. ఇ. ఫస్ట్ క్లాసులో పాసయి, యిలా క్లర్కు పోస్టుకి దరఖాస్తు పెడుతున్నావా? డామ్‌షేమ్! వినటానికి నాకే సిగ్గుగా వుంది!''

రవి ఏదో చెప్పబోయాడు. కాని ఆయన వినిపించుకోలేదు ''అయినా, నీకు మతిలేక పోయినే, మీ తండ్రికైనా బుద్ధి వుండద్దూ?''

## బంగారు కలలు

(10వ పేజీ తరువాయి)

రవి ముఖం ఆవేశంతో కందింది! కానీ, ఎలాగో నిగ్రహించుకున్నాడు.

''యింతకంటే వెళ్ళి రోడ్లు వూడ్చుకో రాదుటోయ్?''

''ఆ పని చేయటానికి కూడా నేను సిద్ధంగానే వున్నానండీ! కానీ, యిచ్చేనాథుడే దొరకటంలేదు! ఎక్కడకెళ్లినా యీ ఫస్ట్ క్లాస్ బి. ఇ. డిగ్రీయే అడ్డొస్తోంది నాకు!'' అన్నాడు రవి గంభీరంగా.

''చదువుకున్న మగాడు మాట్లాడే మాటలేనాయివి? నిస్పృహతో, నీళ్లుకారే



''రాత్రి స్టేజీ మీద 'మీకవిత్వం' చదువుతూ అలా వణికి పోయారెందుకు గురూగారూ?''

''ఆ కవిత పేరే 'చలికాలపు అనుభూతి' కదటయ్యా! అందుకే...''

వాళ్లంటే నాకు ఎలర్జీ!''

''మా బాధ మీకేం తెలుస్తుందండీ! మూడు సంవత్సరాల నుంచీ వుద్యోగం కోసం తిరిగి తిరిగి విసుగుపుట్టింది ఎక్కడకెళ్ళినా నో వెకెన్సీ బోర్డే! పెరటి దోవన ఉద్యోగం సంపాయించాలంటే లంచం యివ్వాలి! లేకపోతే రికమెండేషన్ కావాలి! ఈ రెండూ చేయ లేని మాలాంటి వాళ్లగతి అడక్కండి! చదువు కునేటప్పుడు ఎన్నెన్నో అనుకున్నాము! ఏవేవో చేయాలని కలలు కన్నాను. ఇంజనీరింగ్‌లో కొత్త కొత్త పద్ధతులు తేవాలని, దేశాన్ని వుద్ధరించాలని ఆశలు అల్లుకున్నాను! యిప్పుడనిపిస్తోంది! దేశంమాట దేవుడెరుగు! ఆకలి చావుతో ప్రాణం పోగొట్టు కోకుండా నిలబెట్టుకుంటే అదే చాలని!''

''ఐసీ! ఐ పిటీ యూ!'' ఆయన సాను భూతిగా చూసారు.

''థ్యాంక్‌యూ సర్''రవి వెళ్లబోయాడు.

''అరే! ఆగు! ఏమిటాతొందర? ఇంటర్వ్యూ అయిపోకముందే పోతావేం?''

''మీరు మతివుందా అని అడిగిన క్షణం లోనే ఇంటర్వ్యూ అయిపోయిందండీ!'' రవి సర్టిఫికెట్లు తీసుకోబోయాడు

''అయిపోయిందని చెప్పటానికి నువ్వెవ రివి? నిన్ను యిక్కడికి పిలిపించింది నేను! ఆ మాట చెప్పాల్సిన వాడిని నేను!'' అంటూ ఆయన సర్టిఫికెట్లన్నీ బొత్తిగా పెట్టాడు.

రవి వాటికోసం చెయ్యి చాచాడు.

ఆయన వాటిని భద్రంగా, డ్రాయరు సొరుగు తెరిచి అందులో వుంచి తాళంవేస్తూ ''రేపు ఆదివారం! సెలవు. యింటికి వచ్చి కలు!'' అన్నారు.

''సార్?'' రవి ఆశ్చర్యంగా చూసాడు.

''ఏం? వినిపించలేదా? రేపు వుదయం సరిగ్గా 10 గం. కి మా యింటి దగ్గర కనిపించు! ఇంటర్వ్యూ అయిపోయింది. నౌయుకెన్‌గో!''

ఆయన బెల్ నొక్కాడు.

ప్యూన్ లోపలికి వచ్చాడు.

'నెక్స్టు కాండిడేట్‌ని రమ్మను!'అన్నాడు.

రవి తికమకగా చూస్తూ గది బైటకి వచ్చాడు.

## 4

''నాన్నా! చూడునాన్నా! అక్క కొట్టింది! ఊ! ఊ!'' పదేళ్ల చిట్టి బుడిబుడి రాగాలు తీస్తూ, కళ్లు నులుముకుంటూ తండ్రి దగ్గరకు వచ్చింది.

చిదంబరం పడక గదిలో, పాతకాలపుదిగా వున్న కొయ్యపెట్టె ముందు పెట్టుకుని, దానిలో వున్నడబ్బులెక్క చూసుకుంటున్నాడు. ఈ రోజు అతని ఉద్యోగం వుద్వాసనఅయింది! మళ్లీ ఎక్కడైనా దొరకాలంటే ఎన్ని రోజులు పడుతుందో ఏమిటో! ఈ లోపల దాచినడబ్బు తీసి వాడాలి! ఈ ప్రపంచంలో డబ్బు ఖర్చు పెట్టి ఆనందంగా, అనుభవించడం కొందరి స్వభావం అయితే, గడించిన డబ్బు దాచుకుని, చూసి మురిసిపోవడం కొందరి నైజం! చిదంబరం రెండో కోవకి చెందినవాడు! దాచిన డబ్బు రోజూకళ్లారా చూసుకుని తృప్తి పడటం తప్ప, అందులోనుంచి తీసి ఖర్చుపెట్టాలంటే ఆయన ప్రాణం మీదికి వస్తుంది. చిదంబరం

# సక్రమంగా వాడితే వున్నంత ఎరువులతోనే అధికదిగుబడులు సాధ్యం!



నిస్పృహ చెందకండి !
ఎరువులు తక్కువగా వాడినంత మాత్రాన ఎక్కువ దిగుబడులు సాధ్యంకావని నిరాశచెందకండి.

ప్రాంతానికి తగ్గ రకాలు ఎన్నుకొని, తగిన సాగుపద్ధతులు అవలంభించి సక్రమమైన పంట మార్పిడితో, ఎరువులు కొస్త కొరవైనా ఎక్కువ దిగుబడులు పొందగలరనడంలో అతిశయోక్తిలేదు.

ప్రపంచమంతటా సంభవించిన ముడిపదార్థాల కొరతవల్ల రోజురోజుకు అన్నింటితో సహా ఎరువుల ధరలు కూడా పెరుగుతూన్న ఈకాలంలో సమర్థవంతమైన ఎరువుల వాడకం మాత్రమే వ్యవసాయాన్ని లాభదాయకంగా చేయ గలదు.

ఇది ఎలా సాధ్యం ?

ఉన్న ఎరువులను సక్రమంగా వాడకపోతే వాటి ఫలితం 100 కి 80 పాళ్లే. అవే ఎరువులను సమర్థవంతంగా వాడి నపుడు వాటి ఫలితాన్ని 100కి 100 పాళ్ళ వరకూ పెంచ వచ్చు !

ఎట్లనగా,

**1** సాగుచేసే పొలానికి అవసరమైన పోషక పదార్థాలను మాత్రం పైరును బట్టి నిర్ణయించండి ఇందుకు భూసార పరీక్ష చేయించండి.

**2** సేంద్రియపుటెరువులను వీలైనంత ఎక్కువగా వాడండి. వీటివల్ల రసాయనిక ఎరువుల ఫలితం పెరగడమే కాక నేల యొక్క భౌతిక లక్షణాలు కూడా బాగుపడతాయి.

**3** అవసరాన్నిబట్టి సూక్ష్మ పోషక పదార్థాలను కూడా వాడండి.

**4** సాగుకు అనువైన భూముల్లోనే ఎరువులను వాడండి చౌడు భూముల్లో "జిప్సమ్" వాడి అధిక దిగుబడి పొందండి.

**5** సాగు నీటిని సక్రమంగా వాడండి. చేలలో నీరు నిలచి వున్నప్పుడు ఎరువులు వేయకండి.

**6** పప్పు దినుసుల పైర్లు భూమిలోని నత్రజనిని ఎక్కువ చేస్తాయి. మధ్య మధ్య ఈ పైర్లను పండిస్తే, ముందు పంట లకు నత్రజని మోతాదు తగ్గించవచ్చు.

**7** వేసిన ఎరువులకు పైరుతో పోటీకి వచ్చే కలుపు మొక్క లను నిర్మూలించండి

**8** రసాయన ఎరువులతో మంచి ఫలితాన్ని యివ్వగల అధిక దిగుబడి రకాలను మాత్రమే ఎన్నుకోండి. ఈ రకాలు దేశవాళీ రకాలకన్నా వున్నంత ఎరువుతోనే ఎక్కువ దిగు బడిని యివ్వగలవు.

> మన రాష్ట్రంలో సాగుబడి అయ్యే పంటలలో వరి ముఖ్యమైనది. వేసిన ఎరువులను వృధాకాకుండా సమర్థవంతంగా వినియోగించుకోగల అధిక దిగుబడి వరి రకాలను మాత్రమే సాగుచేయండి.
> ఉన్న ఎరువును ఒకేమారు వాడకుండా దఫాలవారీగా వాడి మంచి ఫలితాన్ని పొందండి.
> భాస్వరపుటెరువును కూడా దమ్ములో ఒకమారు, మూడు నాలుగు వారములలోపున మరొకమారు వాడడం మంచిది. దమ్ములో వాడలేని పరిస్థితుల్లో పైరు వూడ్చిన మూడు నాలుగువారములలో వేయండి
> నత్రజని ఎరువును తక్కువ మోతాదుల్లో ఎక్కువ దఫాలలో చిరుపొట్ట దశ వరకు అవసరాన్నిబట్టి వాడండి.
> ప్రతిసారి ఎరువు వేసేముందు నీళ్ల తీసి, ఎరువు వేసి, 24—48 గంటల తర్వాత నీళ్ళు పెట్టడంవల్ల ఎరువు వృథాకాదు.

పూర్తి వివరాలకు మీ దగ్గరలోనున్న వ్యవసాయ విస్తరణాధి కారిని కలుసుకోండి.

కోరమాండల్ వారి వ్యవసాయ నిపుణులు మీకు తగిన సలహాయిచ్చి తోడ్పడేటందుకు సిద్ధంగా వుంటారు.

ఉచిత సలహాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.




**కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్**

126 సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్









బాంక్‌లని నమ్మడు! ఎప్పుడు ఏది దివాళా తీస్తుందోనని వెర్రిభయం ఆయనకి! అదీ గాకుండా బాంక్‌లో వేస్తే గవర్నమెంటుకి లెఖ్ఖ





చెప్పాలి! అందులో కొంత టాక్సు కట్టాలి! ఎక్కడినుంచి వచ్చిందనే సవాలక్ష ఆరాలు చెప్పాలి! అదంతా చెప్పలేనియాతన! అతని యింట్లో పాతకాలం భోషాణంవుంది! దానిలో ఒకరహస్యమైన అరవుంది. అదే అతని బాంక్! చిదంబరం యింట్లో వున్నంతసేపూ, ఆ భోషాణం మీదనే కూర్చుంటాడు! వేసవి కాలంలో, వుక్కతో ప్రాణం వుక్కిరి బిక్కిరి అవుతున్నా, ఆ భోషాణం విడిచి ఆరుబైట పడుకోడు.

చిన్నకూతురు ఏడుస్తూ దగ్గరకురాగానే, చిదంబరం చప్పున డబ్బు కట్టలన్నీ కొయ్య పెట్టెలోకి తోసేసి, దాన్ని మూతవేసి భోషాణంలో దాచేసాడు. కూతురుని దగ్గరకు తీసుకుని, "ఎందుకమ్మా! ఏమిటి? ఏమైంది?" అన్నాడు. యింతలో పెద్దకూతురు రాధ రయ్యిన అక్కడికి వచ్చింది. "చూడు నాన్నా యిది! బావ వస్తున్నాడు కదా అని సున్నివుండలు చేసిపెడితే, దొంగతనంగా అవన్నీ తినేస్తోంది!" అంటూ చిట్టి బుగ్గ పట్టుకు లాగి, నెత్తిన ఒక్కటి మొట్టింది.

"అబ్బబ్బ! అట్లా కొట్టకే రాధా! తింటే తిన్నది లెద్దూ. చిన్నపిల్ల! దాన్ని ఏమీ అనకు!" చిదంబరం కూతురుని దగ్గరకు తీసుకున్నాడు.

"అంతేగానీ అక్కయ్యకి చెప్పకుండా అట్లా దొంగతనంగా ఎందుకు తిన్నావే అంటూ దాన్ని కేకలు వెయ్యవు. నువ్వట్లా అతిగారాబంచేసేదాన్ని మొద్దవతారంలా తయారు చేసావు. తింటే తిందిలే అంటా వేమిటి? రేపు ఏ కడుపు నొప్పో వస్తే ఎవరు చేస్తారు?"

"నేను చేస్తాను. సరేనా!" ఆయనకి చిన్న కూతురంటే ఎక్కడలేని ప్రేమ! చిట్టి వయసుకి 10-12 సంవత్సరాలున్నా, మానసికంగా బొత్తిగా ఎదగలేదు. ఒట్టి వెర్రి బాగుల్ది! చూసినవి చెప్పేస్తుంది! అనుకున్నవి అడిగేస్తుంది.

"ఏమ్మా! తిన్నావా సున్నుండలు? ఎన్ని తిన్నావు?" అంటూ కూతురి బుగ్గలు నిమిరాడు.

"పది!" రెండు చేతుల అన్ని వేళ్లూ చూపిస్తూ అంది.

చిదంబరం కోపం అంతా రాధమీద విరుచుకు పడింది.

"అయినా వెయ్యిదొరక్క ఛస్తుంటే మన్ను సున్నివుండలు యిప్పుడెందుకూ చేసినట్టు?" అన్నాడు.

"బావ భోజనానికి వస్తున్నాడన్నావుగా! రవి బావకి అవంటే యిష్టం! అందుకని చేసాను" అంది రాధ.

"నువ్విట్లా పిండివంటలతో కొంపంతా గుల్ల చేయద్దు! అసలే నా వుద్యోగం పోయింది ఖర్చులు బాగా తగ్గించేయాలి రాదమ్మ తల్లీ!" చిదంబరం మొత్తుకున్నాడు.

"వుద్యోగం పోయిందా? ఎందుకు?" రాధ ఆదుర్దా పడింది.

"ఏం చెప్పమంటావు నన్ను! రోజులు అసలు బాగాలేదు. ఆ ఆఫీసరు నా పాలిట ఒక సైతాన్ అయిపోయాడు"

"రాజారావుగారు మంచివారేగా నాన్నా! నువ్వే మళ్లీ ఏదో కక్కుర్తిపడి వుంటావు. ఆయన నీ ఆటలు సాగనివ్వలేదన్న మాట!"

"తండ్రిని అట్లా అనచ్చుటే రాధా! నేను నానాగడ్డి కరిచి సంపాయించేది ఎందుకు? నీకోసం — చెల్లాయి కోసమేకదా!"

"అంత గడ్డి కరిచి సంపాయించటం దేనికి నాన్నా! రేపు నన్ను — రాధని గడ్డితిన్నాయన కూతుళ్లు అంటూ లోకం గేలిచేయదూ!"

"నాకు మాత్రం సరదాటేమ్మా! ఈ మండిపోయే ధరల్లో వాళ్లిచ్చే జీతంతో ఏం తింటాం చెప్పు?"

"అసలేం జరిగిందీ చెప్పు ముందు. జ్యోతి నా స్నేహితురాలేగా! అవసరం అయితే జ్యోతి కాళ్లు, గడ్డం పుచ్చుకుని, వాళ్ల నాన్నకి నచ్చచెప్పమని మళ్లీ బతిమలాడుకుంటాను!"

"అది యిదివరకు అయిపోయిందిగా! యిక కుదరదు"

ఇంతలో వాకిట్లోనుంచి 'మామయ్యా' అన్న పిలుపు వినిపించింది.

"అడుగో రవి వచ్చినట్టున్నాడు." అన్నాడు చిదంబరం

"ఎవరూ! రవిబావా!" రాధ సంతోషంగా వాకిట్లోకి ఎదురు వెళ్లింది. రాధ— రవి లోపలకి వచ్చారు.

"రావయ్యా! రా! ఏమిటి విశేషాలు! మీ నాన్న ఎలా వున్నాడు? కూర్చో!" అంటూ పరామర్శ చేసాడు చిదంబరం.

"బాగానే వున్నారు." అన్నాడు రవి కూర్చుంటూ.

"పొలం అమ్మేసారుటగా!"

# షేవర్ స్విష్
## మరియు బద్మాష్‌పూర్ దొంగలు



















**అది ఎల్లప్పుడూ జరుగుతుంది;**
**స్విష్‌తో గెడ్డము గీసుకొన్న మనిషి,**
**సాటిలేని మనిషి.**




"మీకు రెండోసారి ఆపరేషను చేసుకో మని చెప్పేం సరదా ఎక్కి "

"కాని మా ఆమె చిన్నాన్న చిలిపి చేష్టలు మీద వ్యాసం రాస్తోంది. అందుకని. ."

---

"అహా మామయ్యా ! మా నాన్నగారికి అప్పులు అయిపోయినా !"

"అయితేమాత్రం ? చెట్టంత యిద్దరు కొడుకులు వుండగా, బంగారంలాంటి పొలం అమ్మేసారా ?"

"నా సంపాదనతో అప్పు తీరాలంటే—ఈ లోపల తలకుమించిన వడ్డీ అయేట్టు వుంది. అందుకని అమ్మేసాం "

రాధ లోపలకివెళ్ళి కాఫీ తెచ్చి తండ్రికీ—రవికీ యిద్దరికీ యిచ్చింది.

"వేణు పాసయ్యాడా ?"

"లేదు మామయ్యా. పరీక్ష పోయింది మళ్ళీ కట్టిస్తాం ?"

"ఎన్నిసార్లు కట్టిస్తావేంటి ! డబ్బు దండగతప్ప ! నన్నడిగితే నువ్వు, మీ నాన్న యిద్దరూ కలిసి వాడిని చేతులారా పాడు చేస్తున్నారంటాను "

"అదేమిటి నాన్నా ! అలా అంటావు ?" అంది రాధ.

"లేకపోతే ఏమిటమ్మా ! కాస్త కుదురు తక్కువ పిల్లాడని తెలిసికూడా ఆ హాస్టల్లో వుంచటం ఏమిటి ? సినిమాలు—షికార్లతో యింకా విచ్చలవిడి అయిపోమని నేర్పటం కాదా ! నా దగ్గర వుంచవయ్యా వాడి సంగతి చెడులు నేను చూస్తాను అని ఎన్ని సార్లు చెప్పినా బావ వింటేనా ! ఏం ? నేనేమైనా పరాయివాడినా? మీ అమ్మకి పిన్తల్లి కొడుకునేగదా ! మా చెల్లెలే వుంటే నా మాట కాదనేదా ! యిలాంటి అవసరాలు వచ్చి నప్పుడు ఒకరికి ఒకరు కాస్త ఆసరాగా వుండక పోతే ఎలా ?"



## బంగారు కలలు

"సరే మామయ్యా! నాన్నతో చెబుతాను." అన్నాడు రవి.

"యింతకీ నీ యింటర్వ్యూ సంగతి ఏమైంది ?"

"ఆయన రేపు వుదయం 10 గం.కి వాళ్ళింటికి వచ్చి కలవమన్నాడు."

"అన్నాడా !" అంటే అంతే ! , రేపే జాయిను అవ్వమని ఆర్డరు యిచ్చేయటమే ! దాని అర్థం ! తెలుసుకో !"

"లంచం యిచ్చే పద్ధతి అయితే యిన్నాళ్ళూ నిరుద్యోగిగా ఎందుకు వుంటాను !"

"అట్లా అనుకుంటే సువ్వాయన దగ్గరకి వెళ్ళనవసరంలేదు !"

"ఛీ ఛీ ! రాజారావుగారు అలాంటి మనిషి కాదు నాన్నా !" అంది రాధ.

"నువ్వూరుకోమ్మా! నీకేంతెలుసు ! ఆ పెద్ద మనిషి తనం, ఆ దాబు అదంతా పైన మేలి ముసుగు !"

"అయితే తప్పకుండా వెళ్తాను. వెళ్ళి నాలుగా 'దిగివస్తాను!'" అన్నాడు రవి ఆగ్రహంగా.

"యిక భోజనానికి లెండి," అంది రాధ వంటింట్లోకి వెళ్ళబోతూ.

" నేను చేసేవచ్చాను మామయ్యా " అన్నాడు రవి

చిదంబరం ముఖం వివర్ణమైంది. కానీ, పైపైకి కోపం నటిస్తూ "తినేవచ్చావా! యిక్కడేమో మేము నీ కోసం ఎదురు చూస్తుంటే ! రాధ నీ కోసం యిష్టమని ఏవేవో చేసింది! బంగాళదుంపలు వేపుడుట! మజ్జిగపులుసుట! పరమాన్నంట! పులిహోరట! దాని మొహంట! నా మొహంట!"

వంట యింట్లోకి వెళ్ళబోతున్న రాధ తండ్రి అబద్ధాలు విని ఆశ్చర్యపోయింది !

"అయ్యో ! రాధ యింత ఆర్భాటం చేస్తుందని అనుకోలేదు మామయ్యా ! లేకపోతే తప్పకుండా భోజనానికి వచ్చివుండే వాడిని !" రవి నొచ్చుకున్నాడు.

"ఏమిటో మావి పిచ్చి ఆపేక్షలనుకో ! ఈ కాలం వాళ్ళకి నచ్చవు అని తగ్గించు కుందామనుకున్నా తగ్గవు అందులో మీ అమ్మ వుందే! అదంటే నాకు ప్రాణం ! నిన్ను చూసినా, వేణుని చూసినా నాకు దాన్ని చూసినట్టే వుంటుంది." చిదంబరం చిన్నప్పటి సంగతులు చెప్పటం ప్రారంభించాడు.

# 5

చాలా అధునాతనంగా, చాలా సింపిల్ గా వున్నయిల్లు అది !! ఆ యింట్లో వంటగదిలో ఇరవైరెండు సంవత్సరాల అమ్మాయి వంట చేస్తోంది! ఆమె బంగారు, ఆ తొందర, చేస్తున్న తీరూ చూస్తే వంటచేయటం కొత్త అని చెబుతూనే వుంది. చెమటబిందువులు తడిసిన చేతుల్తో ముక్కు తుడుచుకుంటోంది. ముక్కు ఖీళ్ళకారుతూ మంటవుడుతుంటే చెబురుమాలుతో మాటిమాటికి వత్తుకుంటూ ఎగబీలుస్తోంది. కంగారులో వేసుకువేసిన చేతో, చెంపమీద జారుతున్న జుట్టుని చెవి పక్కకి నెట్టుకోవటంలో, చెక్కిలిమీద పసుపు మరక అయినట్టు ఆ అమ్మాయి చూసుకోలేదు. చాలా వుత్సాహంగా వంటచేస్తూ, గబ గబా అటూ యిటూ తిరుగుతూండటంవల్ల ముఖం నిండా చిరుచెమటలు అలుముకుని, బొట్టు చెరిగి పొడుగ్గా ఒక పక్కకి తోకచుక్కలా అయింది.

ఇంతలో నల్లటిరగ్గు నిండుగా కప్పుకుని, వంటమనిషి సింహాచలం 'అమ్మాయిగారూ !' అని పిలుస్తూ అక్కడికి వచ్చాడు. వంట చేస్తున్న జ్యోతిని చూడగానే, ఒక్క నిముషం అలాగే నిలబడిపోయాడు. "అయ్యయ్యో ! అమ్మాయిగారూ! మీరు వంట చేస్తున్నారా ? డాక్టరు దగ్గరకు వెళ్ళి మందు తెచ్చుకుని యిప్పుడే వస్తానని మీకు చెప్పే వెళ్ళాను కదండీ! ఎందుకంత తొందరపడ్డారు? మీరు పనిచేయటం నాన్నగారు చూస్తే యింకే మైనా వుందా ? నన్ను నిలువునా పాతంగా షూట్ చేస్తారు. పిల్లలుగలవాడిని" అంటూ లబలబలాడాడు.

జ్యోతి కూర దించి గిన్నెలో సర్దుతూ, "డాక్టరేమన్నాడో చెప్పు" అంది.

"ఏమంటాడు ? ఈ డాక్టర్లున్నారే ! జబ్బు త్వరగా తగ్గిపోయినా వైద్యం మానరు. జ్వరం ఇంకా వుందిట, బాగా విశ్రాంతి తీసుకో మన్నాడు.

"మరి యింకా యిక్కడ నిలబడ్డావేం ? వెళ్ళు డాక్టర్ చెప్పినట్టు చెయ్యి."

"కానీ యీ పూటవంట—"

"నేను చేసేసానుగా! పోయి నిశ్చింతగా పడుకో! నువ్వు వస్తే నన్ను వంటయింట్లోకి రానివ్వవనే నువ్వు వచ్చేలోపల చేసేసాను. చూడు సింహాచలం! ఈ రోజేకాదు. నీ జ్వరం

## పాపభాష

**మా** పాపపేరు సవిత దానికి మొన్నీ మధ్యనే ఏడాది వెళ్ళింది. మాటలు యిప్పుడిప్పుడే వస్తున్నాయి ఒకసారి మేము బయటికి వెళదామనుకుంటుండగా మా పిన్ని వచ్చింది. (ఆవిడ ఈ ఊళ్ళోనే ఉంటున్నది లెండి) పిన్ని ఎలాగూ వచ్చిందికదా అని సవితను ఆవిడకు అప్పగించి, అరగంటలో వస్తామని చెప్పి వెళ్ళాము

మేము వచ్చేసరికి ఆవిడ, మా సవితతో నానా హైరాన పడుతున్నారు. 'ఏమిటండీ' అని అడిగితే, "చూడు తల్లీ! నీ ముద్దుల కూతురు ఆగడం! అన్నం, పప్పు, చారు అంటున్నది. ఆకలేస్తుంది గావాల్న అనుకుని అన్నం పెడితే విసిరికొట్టింది. ఆచ్చి (షికారు) పోతానంటోంది" అని చెప్పింది.

దానితో నాకు నవ్వాగక "అదికాదు, పిన్ని



## చిన్నారి చిలిపిచేష్టలు

గారూ! దాని మాటల అర్థం వేరే వుంది. మా మేడమీద వుంటున్న ఆవిడకు ముగ్గురు ఆడపిల్లలు. వాళ్ళు సవితను ఎత్తుకుని తిప్పుతారు వాళ్ళ పేర్లు అనసూయ, ప్రపూర్ణ, శారద. వాళ్ళనే మా సవిత అన్నం, పప్పు, చారు అంటుంది." అని చెప్పాను.

ఇది విని, మా పిన్నికూడా విరగబడి నవ్వింది.

— శ్రీమతి జి. నాగమణి

## బంగారు కలలు

నేను ప్రైవేట్ ప్రకారం యిస్తాను" అంటూ మందు, చీటి తీసుకుంది

సింహాచలం ముఖంలో కృతజ్ఞత వెల్లి విరిసింది.

"మా అమ్మాయిగారు దేవత!" అన్నాడు

"ఊ! దేవతాకాదు దెయ్యంకాదు వెళ్ళి పడుకో!" అంటూ కసిరింది

జ్యోతిది అచ్చు తండ్రి స్వభావమే! పొగడ్తలంటే గిట్టదు.

వంటమనిషి వెళ్ళాడు.

జ్యోతి వంటయింట్లో పని ముగించుకుని, చేతులు తుడుచుకుంటూ, "మల్లమ్మా! మల్లమ్మా!" అని బిగ్గరగా పిలుస్తూ హాల్లోకి వచ్చింది. హాలు మధ్యగా యిల్లు తుడిచే గుడ్డ పడివుంది. బకెట్‌లో నీళ్ళు వున్నాయి. పనిమనిషి చేస్తున్నపని మానేసి, ఓ పక్కగా నిలబడి, నోట్లో బారాటి చుట్ట పెట్టుకుని, గుప్‌గుప్‌మని పొగ పీల్చి వదులుతోంది.

ఈ దృశ్యం చూడగానే జ్యోతి మండి పడింది.

"ఏయ్ మల్లమ్మా! యింట్లో పని చేసేటప్పుడు చుట్ట కాల్చ గాడదని ఎన్నిసార్లు చెప్పాను నీకు?" అంది కళ్ళెర్రచేస్తూ

మల్లమ్మ రవంత కూడా భయపడలేదు

చుట్ట కాల్చటం నా జన్మహక్కు అన్నట్టు చూస్తూ కూచుంది.

"నీకే చెప్పేది? వినిపించటంలా?" జ్యోతి కసిరింది.

"ఏంటమ్మా! యీ చాకిరీ యిప్పుడు తెములుద్దా! పొద్దుట లేవగానే కాఫీనుక్క పడితేగానీ, మీ పేనం ఎట్టా నిలవదో, గంటకో సారి యిది కాలిస్తేగానీ నాకూ నిలవదు" అంటు చుట్టనుస్సి క్రింద దులిపింది

"ఏమిటా దులపటం? యిది యిల్లనుకున్నావా? గొడ్లపాక అనుకున్నావా? క్రిందంతా చూడు! ఎంత నుసి రాలిందో?"

"నుసికేమిటమ్మా! తుడిస్తే అదే పోతుంది" కాలితో రాసింది.

"ఛి ఛీ! వెధవ కంపు! ఇల్లంతా చుట్టేసింది!" జ్యోతి ముక్కు చిట్లించి ముఖం వెగటుగా పెట్టింది

"మీరు రాసుకునే సెంట్లు కంటే బాగానే వుంటుంది."

"నోర్ముయ్! చిన్నా పెద్ద లేకుండా ఏమిటామాటలు! యింకోసారి యింట్లో పని చేస్తుండగా నీ చేతిలో అది కాస్తానంటే—"

"ఏంచేస్తావేం? తలతీసి మొలేస్తావా?"

"ఆట్టే వాగావంటే యిప్పుడే మెడబట్టి గెంటుతాను జాగ్రత్త!"

"ఓయబ్బో అన్నారు. నీకంత కష్టం దేనికిలే! నేనేపోతాన్లే!"

"పోతేపో! మళ్ళీ యీ గుమ్మం ఎక్కకు! పనిచేసుకోవటం చేతకాని వాళ్ళదగ్గర కెళ్ళి బెదిరించు!"

"అబ్బో! ఎప్పుడు చూసినా ముక్కుమీద కోపం నీకు! చూస్తాను! ఎవత్తి వస్తుందో యీ యింటికి! పని చేసుకుంటుందట! చేసుకో చూద్దాం! రెండు రోజులు గిన్నెలు తోమితే తెలుస్తుంది పని!"

అంటూ విసవిసా నడిచి వెళ్ళిపోయింది!

"యిదుగో! ఏయ్ నిన్నే! ఈ చుట్టనుసి తుడిచివెళ్ళు" జ్యోతి కేకలు పెట్టింది.

మల్లమ్మ వెనక్కి తిరగలేదు మహారాణిలా నడిచి వెళ్ళిపోయింది

జ్యోతి ఒక్క క్షణం నిర్ఘాంతపోయిలా నిలబడిపోయింది! ఆవేశంతో వుక్కిరి బిక్కిరి అయిపోతున్నట్లుగా చూసింది! ఆ వెంటనే తల ఎగరేసి, నయిటచెంగు లాగి, తిప్పి నడుములో దోపుకుంది చీరకుచ్చెళ్ళు పైకి ఎక్కించుకుంది. క్రింద పడివున్న గుడ్డతీసి నీళ్లలో ముంచి, గబగబా యిల్లు తుడవసాగింది. ఆ రోజున ప్రప్రథమంగా, మల్లమ్మ పని చేస్తానని వచ్చినప్పుడే తండ్రి, "యిది గజ్జెం గుర్రంలా వుందమ్మా మనకి వద్దు వేరే మనిషిని చూసుకుందాం!" అని హెచ్చరించాడు. తనే వినలేదు వాళ్ళని బాగా చూస్తే వాళ్ళు పని బాగా చేస్తారు అనుకుంది. మల్లమ్మ అక్కడంతా రాల్చివెళ్ళిన నుసి చూసేసరికి జ్యోతికి యింకా ఒళ్ళు మండింది.

"తింటానికి లేకపోయినా పొగరు మాత్రం చాలా వుంది. యిలాటివాళ్ళు గంగిరెద్దుల్లా తిరగడం తప్ప పని చేయరు" అని సణుక్కుంటూ, పనిమనిషి మీద కోపం అంతా, నేలమీద చూపిస్తూ, విసురుగా తుడవసాగింది.

అదే సమయంలో రవి లోపలికి అడుగు పెట్టాడు

ఎండలోనుంచి లోపలికివచ్చిన అతను సరిగ్గా జ్యోతిని గమనించలేదు గమనించినా జ్యోతి యింటి యజమానురాలిలా గుర్తుపట్టేట్టు లేదు. "ఇదుగో! ఏయ్ అమ్మీ! నిన్నే! మీ అయ్యగారున్నారా యింట్లో?" అని అడిగాడు. (ఇంకా వుంది)

సీరియల్

# పట్టిలోని కెరటాలు

ఎం.పి.ఆర్.రాధాకృష్ణ

(గత సంచిక తరువాయి)

"తప్పు చేయడం మానవత్వం అయితే, చేసిన తప్పును క్షమించగలగడం దైవత్వం తల్లీ! అతనుచేసింది తప్పే.. కాదనను. ఆ వాడు తన పొరపాటు తెలుసుకుని వచ్చాడు. ఎంత మంచివాడయినా, పరిస్థితులు ఒక్కో సారి తలవంచి తప్పుచేయిస్తాయి! కాదనకమ్మా ...అబ్బాయి స్వతహాగా చాలా మంచివాడు. జరిగిందేదో జరిగిపోయింది ... నా మాట కాదనకు!" అనునయంగా అన్నారు రాజారావు గారు.

రామారావు మధ్యలో కల్పించుకుని అన్నాడు..."అరుణా ...మేమంతా నీకంటే పెద్దవాళ్ళం! మా మాట విను. సుధాకర్ తప్పు చేయలేదని నేను అనను. కానీ, అంత మాత్రానికే సుధాకర్ దుర్మార్గుడు కాదు మానసిక దౌర్బల్యం ఎవరికైనా ఉంటుంది అంతమాత్రానికే, జీవితంలో అతిపవిత్రమైన వివాహ బంధాన్నే తెంచుకుంటావా?"

అరుణ చిన్నగా నవ్వింది... "చిన్న విషయాల్ని, బాగా పెద్దదిచేసి చూపించకు అన్నయ్యా! మనిషి ముందు. ఆ తరువాతనే ఈ అనురాగాలూ, అనుబంధాలూ! మనిషిని మించినది కాదీ వివాహ వ్యవస్థ! ఒకవేళ నువ్వన్నట్లు వివాహబంధం అతి పవిత్రమైనదే అయితే...భార్య చనిపోయిన మగాడు తిరిగి ఎందుకు వివాహం చేసుకుంటున్నట్లు? ఈ శుష్క ప్రియాలుకాదు జీవితానికి కావలసింది ఆత్మగౌరవం కావాలి ... వ్యక్తిగా గుర్తింపబడాలి! రెండూ నా విషయంలో దెబ్బ తిన్నాయి. నా వ్యక్తిత్వాన్నే శంకించి, నన్ను అవమానించిన వ్యక్తిని నేను ఏనాడూ క్షమించను..." అరుణ దృఢంగా అంది.

"ఏమిటా పొగరు? అవతల వాళ్ళున్నారు వింటారు. తెలిసీ తెలియకుండా వాగకు ...' జానకమ్మ కోపంగా అంది!

"ఎంతో వినని! ఒకరి కోసం నేను బ్రతకలేను. నేను నా కోసం బ్రతుకుతాను అంతే!"

"తొందరపడకమ్మా! బాగా ఆలోచించు! అండలేని తీగను ప్రతి పశువూ అందుకోవాలని చూస్తుంది! ఒంటరిగాఉన్న ఆడదానికి, పరువుగా బ్రతికే అవకాశాలు లేని సమాజం ఇది! మగవాని తోడు లేకుండా, ఎంతోకాలం బ్రతకలేవమ్మా...". అన్నారు రాజారావుగారు

"ఆడవాళ్ళు తీగలనీ, అబలలనీ, వారికి తమ కాళ్ళమీద తాముగా నిలబడే శక్తి లేదనీ అనుకునేకాలం పోయింది, నాన్నగారూ! అబలలు, అబలలు – అంటూనే ఆడదాన్ని శక్తిని అధఃపాతాళానికి అణగద్రొక్కారు. ఆడదంటే విలాసవస్తువని, అంగట్లో దొరికే చవకబారు పుస్తకమని ... అనుకుంటే ... పొరపాటు. మీరింకేం చెప్పకండి! నేను వినదలచుకోలేదు. నా బ్రతుకు నేను బ్రతకగలననే ధైర్యం నాకుంది." అరుణ, మరో మాటకు అవకాశం ఇవ్వకుండా లేచివెళ్ళిపోయింది!

చేసేదిలేక భారంగా నిట్టూర్చారు, రాజారావుగారు.

## 33

ఆఫీసులో కూర్చుని డ్రాఫ్ట్ రాసుకుంటూంది అరుణ! చేయి ముందుకు సాగటంలేదు. బలవంతంగా ఆలోచనల్ని కేంద్రీకరింప చేయాలని వ్యర్థ ప్రయత్నం చేసింది!

వీల్లేకపోయింది...

ఆఫీసర్‌తో చెప్పి, పర్మిషన్ తీసుకొని ఇంటికి బయల్దేరింది! ఎండలో నిలబడి బస్సుకోసం ఎదురు చూస్తున్న అరుణ, రోడ్డుకు అవతలివైపు పేవ్‌మెంటు షాప్స్‌లో ఏదో కొనుక్కుంటున్న వ్యక్తినిచూసి ఆశ్చర్యపోయింది...



"పద్మలా ఉంది..." అనుకొనేంతలో, ఆమెకూడా అరుణవైపే చూసింది!

ఇద్దరూ క్షణం ఒకరినొకరు చూసుకున్నారు!

ఆమె వడివడిగా రోడ్డుదాటి వచ్చేసింది...

"అరుణా, నువ్వా!" అంది సంతోషంగా!



## ఏటిలోని కెరటాలు

"పద్మా... ఏమిటే ఇది... అనుకోకుండా!" అరుణ, సంతోషంతో అంతకు మించి ఎక్కువ మాట్లాడలేక పోయింది!

"ఎన్నాళ్లయిందే నిన్ను చూసి... బాగున్నావా?" ఆప్యాయంగా అడిగింది పద్మ!

"నామాటకేంగాని, నువ్వెప్పుడొచ్చావు!" అరుణ తిరిగి అడిగింది!

"మా వారికి ఇక్కడకు 'ట్రాన్సఫర్' అయి మూడు నెలలయింది. అప్పటి నుండి ఇక్కడే ఉంటున్నాను!"

"అమ్మదొంగా. మూడు నెలలయివచ్చి, మా యింటికి రాలేదేమె?" అరుణ నిష్ఠూరంగా అంది

"నువ్విక్కడే ఉంటావని కలగన్నానా? అది సరే... ఈవేళప్పుడు ఇక్కడున్నావేమిటి?"

"ఆఫీసునుండి వస్తున్నాను!"

"ఆఫీసా...!" పద్మ ఆశ్చర్యంగా అడిగింది..."నువ్వు ఉద్యోగం చేస్తున్నావా?"

"ఏం! చేయకూడదా?"

"కూడదని కాదు! కానీ, మీవారు వైజాగ్‌లో కదూ ఉంటున్నారు?"

"కాదని ఎవరన్నారు?"

పద్మ విసుక్కుంది... "ఏమిటే నీ మాటలు!... మీవారు వైజాగ్‌లో ఉంటే... నువ్విక్కడ ఉద్యోగం చేయడమేమిటి?"

"అదంతేలే! ఇలా రోడ్డుమీద నిలబడే కబుర్లు చెప్పుకుందామా?" అరుణ నవ్వింది... "పద, ఇంటికి వెళ్దాం!"

"మీ యింటికా దు... మా యింటికి వెళ్దాం! మీ యిల్లు నాకెలాగూ తెలుసు! మా యిల్లు నువ్వు చూడొద్దూ!" అంది పద్మ.

విద్యానగర్ కాలనీలో ఒక చిన్న డాబా యిల్లు అది.

ఇల్లు చిన్నదే అయినా చాలా ముచ్చటగా ఉంది.

"ఇదే మా కుటీరం!" అంది పద్మ, ఇంటి తాళం తీస్తూ!

"మీ వారు లేరా?"

"లేకేం...నిక్షేపంలా ఆఫీసులో ఉన్నారు. ఆయనలా వెళ్ళనిచ్చే, నేను బజారుకు వచ్చాను." పద్మ నవ్వింది.

"రాక రాక వచ్చావు. ఏదైనా టిఫిన్ చేస్తానుండు..." అంటూ వంటింట్లోకి దారి తీసింది...

"అవేం పెట్టుకోకే! ఇప్పుడేంవద్దు..."

పద్మ ఆశ్చర్యంగా చూసింది... "అదేం మాట! పద... ఇద్దరం కలిసే చేద్దాం! చాలా రోజులయిందే... అల్లరి మానేసి!" అంది.

**జరిగిన కథ:** రాజారావు జానికమ్మల సంతానం అరుణ. వారింటి ప్రక్కనున్న రామారావు, అతని భార్య సరస్వతి— ఈ ఇద్దరితో అరుణకి స్నేహం. రామారావు చిన్ననాటి స్నేహితుడు సుధాకర్. విశాఖపట్నం నుండి ఆఫీసు పనిమీద హైదరాబాద్ వచ్చిన సుధాకర్ అరుణని చూసి ఆమెని రామారావు ప్రోత్సాహంతో వివాహం చేసుకోవాలనుకుంటాడు సుధాకర్ తండ్రి శివరావు భార్య వద్దన్నా అరుణ సుధాకర్‌ల వివాహం జరిపిస్తాడు. అరుణ సుధాకర్‌లు విశాఖపట్నం వస్తారు. అరుణ చిన్ననాటి స్నేహితుడు శ్రీహరి అరుణ ఇంటికి విశాఖపట్నం వచ్చివెళతాడు. అరుణకు ఆడపిల్ల పుట్టింది. పాపకు జ్యోతి అని పేరుపెట్టాడు సుధాకర్. సుధాకర్ అరుణలతోపాటు విజయకూడా విశాఖపట్నం వచ్చింది. సుధాకర్ తన స్నేహితుడు శాంతారాంను, అరుణకు పరిచయం చేశాడు. శ్రీహరి తను పోపంజాబీ అమ్మాయిని ప్రేమించి తన తల్లిదండ్రులకు తెలియకుండా వివాహం చేసుకున్నానని అరుణకు ఉత్తరం వ్రాశాడు. శాంతారాం తరచూ సుధాకర్ ఇంటికి వస్తూవుంటాడు. సుధాకర్ మేనత్త సావిత్రి వచ్చివెళుతుంది. విజయ హైదరాబాద్ వెళ్లిపోతుంది. అరుణ అత్తగారు దుర్గమ్మ వచ్చింది. ఆమె మాటలు అరుణ, శాంతారాంలను అనుమానించేట్లు చేస్తాయి సుధాకర్‌ను. శాంతారాం ఉత్తరంతో సుధాకర్ అనుమానం బలపడింది. అరుణను పుట్టింటికి పంపేస్తాడు సుధాకర్. తిరిగి సుధాకర్ దగ్గరకు వెళ్ళడానికి ఇష్టపడదు అరుణ. శ్రీహరి విశాఖపట్నం వస్తాడు. శ్రీహరి ద్వారా ఉత్తరం గురించి తెలుస్తుంది రాజారావుగారికి. ఆ ఉత్తరం విజయకు వ్రాసిందని చెప్పినా వినకుండా విడాకులకు ప్రయత్నిస్తానని సుధాకర్ అనడంతో శాంతారాంని కలుస్తాడు రామారావు. శాంతారాంకు విజయ వ్రాసిన ఉత్తరాలు చూచి తన తప్పు తెలుసుకుంటాడు సుధాకర్. రాజారావుగారి ఉత్తరం చూచి అరుణను తీసుకురావటానికి హైదరాబాద్ వెళతారు శివరావుగారు సుధాకర్‌తో. అనవసు నచ్చచెప్ప ప్రయత్నించిన తల్లిదండ్రుల మాటలను తిరస్కరిస్తుంది అరుణ.

"ఇంకా అల్లరేమిటి ? ఆవయసా ఇది!" అరుణ నిర్లిప్తంగా అంది !

"ఏమిటో అనుకున్నాను బాగా మారి పోయావ్ అరుణా!" అంది పద్మ, పిండిలో నీళ్లు పోస్తూ !

"మారిపోక చేసేదేముంది పద్మా ! ఇంకా చిన్నవాళ్లం కాదుగా!" —

"అబ్బో .. ఏమిటో అనుకున్నాను. ఆరిందావై పోయావ్ ! పిల్లలెంతమందే మిటి ?" చిలిపిగా అడిగింది పద్మ !

"ఒకతే ఆడపిల్ల ! పేరు జ్యోతి ! మా యింటికి రా... నిన్ను ముప్పతిప్పలూ పెట్టేస్తుంది. నీ అల్లరి ఎర్దాలయినా తీరుతుంది!"

"నీ కూతురేకదూ...అల్లరికేం తక్కువ!"

టిఫిన్ ముగించి తీరుబడిగా కూర్చున్నారు స్నేహితురాళ్లిద్దరూ !

"నేనడిగిందానికి సమాధానం చెప్ప లేదు..." పద్మ అంది !

"ఏమిటే...అది!"

"అదే ... నీ ఉద్యోగం సంగతే ! మీ వారక్కడ, నువ్విక్కడ ...? అంటున్నానని మరోలా అనుకోకు! నిన్ను చూస్తుంటే మామూలుగా లేవు ! ఏమైనా స్పర్ధలు వచ్చాయా?" అడిగింది పద్మ.

అరుణ నిట్టూర్చింది ... "నీకు చెప్పక పోవడమేం? అదంతా చాలా పెద్దకథ!"

"అంత కథ ఉందా ! ఏమిటే అది!" ఆత్రుతగా అడిగింది.

# ఏటిలోని కెరటాలు

జరిగినదంతా చెప్పింది అరుణ !

నిశ్శబ్దంగా అంతా విన్నది పద్మ !

"నేను తప్పు చేసానంటావా పద్మా!" అడిగింది, అరుణ.

"తప్పు చేశావని అనలేనే! కాని...ఇంకొక్క సారి ఆలోచించి వుండవలసింది !"

"ఒక్కసారి కాదు పద్మా! వందసార్లయినా ఆలోచించాను. ఎన్నిసార్లు ఆలోచించినా...ఇంత కంటే వేరే మార్గాంతరం తోచలేదు !"

"నిజమే అరుణా! తోచదు. ఒకపుస్తకాన్ని ఎన్నిసార్లు చదివినా అవే అక్షరాలుంటాయి. అలానే... ఒకే కోణంలో ఎన్నిసార్లు ఆలోచించినా, నీకు ఇంకొక మార్గం కనిపించదు. గానుగెద్దులా...బయల్దేరిన చోటికే, మాటి మాటికీ వస్తావ్ !"

పద్మ మాటలకు అరుణ నివ్వెరపోయింది "పద్మా...ఏమిటే అంటున్నావ్..."

"కోపం తెచ్చుకోవద్దు అరుణా ! నువ్వు నీ దృక్పథంలోనే ఆలోచించావు. నీ ఆలోచన ఒకే పరిధిలో సాగింది. ఒక నాణానికి ఒక వైపే వుండదు. బొమ్మా, బొరుసూ ... రెండూ వుంటాయి ! నీ కోణం నుండి ఆలోచించ గలిగావు గాని, మీ వారిగురించి ఆలోచించలేదు !"

"ఆయనగురించిఆలోచించడానికేముంది?"

"ఏమీ లేదా? ఎంత పిచ్చిగా మాట్లాడుతున్నావే! కొన్ని సంవత్సరాలు కలిసి కాపురం చేశారు ! ఆ మాత్రం ఆలోచించేపాటి అర్హతే లేదా తనకు !"

"అది కాదు నా ఉద్దేశం!" అరుణ ఏదో చెప్పబోయింది.

"నీ ఉద్దేశం ఏదైనా కావచ్చు అరుణా ! కానీ, నిష్పాక్షికంగా ఆలోచించగలగాలి! అత నెవరో కాదు ! నీ భర్త. ఇంత సులభంగా జీవిత సమస్యను పరిష్కరించ గలిగావంటే, ఆశ్చర్యంగా ఉంది!"

"అంటే, మగవాడేం చేసినా చచ్చినట్లు పడుండాలన్న మాట!"

పద్మ నవ్వింది... "చచ్చినట్లు పడివుండే ఖర్మ ఎవరికీ లేదు అరుణా !

అసలు నువ్వు ఒక విషయం విస్మరిస్తున్నావ్! తప్పు అతనిదే గాని, నీదేం లేదా ?" సూటిగా అడిగింది.

"నాదా. .నా తప్పేముంది ?"

"అటువంటి పరిస్థితిని సృష్టించ టానికి కారణం నువ్వే ! సుధాకర్ నీ మీద నమ్మకముంచాడు ఆ నమ్మకాన్ని కాపాడుకో లేక పోయావ్ ! విజయ, శాంతారాంల సంగతి నువ్వు తనతో ముందుగానే చెప్పి ఉండవలసింది. అసలే అనుమానం పాలైన మనిషి, అటువంటి ఉత్తరం చూసి ఏమను కుంటాడు. అంటున్నానని అన్యథా భావించకు. నువ్వు చాలా తొందర పడ్డావని మాత్రం చెప్పగలను" (ఇంకా వుంది)



## రాజకీయాల్లో రాజకీయం

పాండిచ్చేరి వర్తమానాల. ఎన్నికల ప్రచారాలను ముగించి చేతులు కడుక్కున్న కామరాజుగారు ఇందిరా కాంగ్రెసు పథకాలను, సిద్ధాంతాలను తనకు నచ్చవని, నచ్చవేలేదని కనుక ఇందిరా కాంగ్రెసును ఆదరించవద్దని, ఆ కాంగ్రెసుకు వోటు వేయవద్దని వోటరు మహాశయులనుద్దేశించి అన్నారట — ఇదిలా వుండగా పాతకాంగ్రెసుకు బొత్తిగా బలం లేదని, ఆ కాంగ్రెసుతో తాము చేతులు కలపడమేని ఎన్నడూ లేదని ఆ కాంగ్రెసులోంచి తమ కాంగ్రెసుకు మారాలని మహామహులు ప్రయత్నిస్తున్నారని, కాని అటువంటి వారందరినీ తమ కాంగ్రెసు అంగీకరించదని, ఉత్తర ప్రదేశ్‌కు చెందిన మధురలో మాట్లాడుతూ ప్రధాని గాంధీ అన్నారట. ఎన్నికల ప్రచారం కోసం . . . అదీ కేవలం పాండిచ్చేరి, కోయంబత్తూరు ఎన్నికలకోసమే కామరాజుగారూ, ఇందిరా గాంధిగారూ కలిసి పని చేయడం జరిగిందని, తమిళనాడులో ప్రమాదకరమైన భావాలున్న డి. ఎం. కె. పార్టీని పదవినుంచి దింపడానికే రెండు కాంగ్రెసులకు చెందిన ప్రముఖులిద్దరూ కలిశారని పార్టీలు కలపడమనే ప్రశ్న లేదని, కామరాజుగారికి తమ కాంగ్రెస్ అంతవరకు (ప్రచారం వరకే) అనుమతి ఇచ్చిందని నిజలింగప్పగారన్నారట — దీ జ్యారియలే పొలిటిక్స్.

## అన్యాయానికి ఆత్మాహుతి

హిమాచల్ ప్రదేశ్‌కు చెందిన జాయింట్ అగ్రికల్చరల్ ప్రొడక్షను కమీషనరు యస్. యస్. గుల్‌రాయ్ అనే ఐ. ఏ. ఎస్. ఆఫీసరుగారు సిమ్లాలోని తన నివాసంలో చనిపోయివున్న విషయం పోలీసు 22వ తేదీన చూసిందట. ఆయన శరీరం కాలిపోయుందట. ఉద్యోగంలో ఎదురుచూసిన న్యాయం జరగలేదని, తనను కొందరు అన్యాయంగా అణచివేస్తున్నారని నిరుత్సాహపడి ఆయన ఆత్మహత్యచేసుకుని వుండివుండాలని ఆయన సన్నిహితులన్నట్లు పోలీసు అన్నదట

## ప్రేమించు చావుకై

తిరువణ్ణామలైకు చెందిన పళనిఅనే ఆయన కూతురు త్రిపురసుందరి అదేవూరుకు చెందిన ఒక [illegible]కునికి తన మనసిచ్చి, అతనిదితానుతీసు[illegible] అ[illegible] [illegible]దట. అంతటితో ఆగక వారిద్దరూ తరచు [illegible]కోడాలు, ప్రేమలేఖలు రాసుకోడాలు — —

**22-3-1974 శుక్రవారం మొదలు**
**28-3-1974 గురువారం వరకు**

# వారఫలం

మహేష్

**మేషం:—** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. మీ తలరాకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిథునం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం:—** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన ఇబ్బందులు కలిగినా వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు—వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**కన్య:—** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. రావలసినడబ్బు సమయానికి అందుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో ఆందోళన కలుగుతుంది. ముఖ్యమైన పనులు మీరు స్వయంగా చూడడం మంచిది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**తుల:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:—** వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఉద్యోగంలో ఇతరుల నిమిత్తం శ్రమకు గురికావలసి వస్తుంది. స్త్రీలకు—నూతన విషయాలను తెలుసుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:—** సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మకరం:—** వ్యాపారంలో అనుకూలమైన వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్థి వ్యవహారాలో

చేసుకుంటేవారట. కానీ త్రిపురసుందరి అన్నగారికి విషయం తెలిసి ఆమె అతన్ని కలసుకోనీకుండా కట్టుదిట్టాలు చేశాడట. ప్రియుని ఎడబాసి, బ్రతుకలేనని... అని నిర్ణయించుకున్న త్రిపురసుందరి నూతిలోపడి ఆత్మహత్య చేసుకుందట.



...ప్రయత్నాలు ఫలిస్తాయి. ... పోవడం వలన మనస్సుకు ... కలుగుతుంది. (స్త్రీలకు— ... ఫలిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

కుంభం :— రావలసిన డబ్బు అందుతుంది. ... కళారంగంలో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి. అధికారుల వలన ... జరగవలసిన వ్యవహారాలు సునాయాసంగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. (స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

మీనం :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి.

... సంఘంలో గౌరవం బాగుంటుంది. విలాసవస్తువులు ... మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు ఫలించవు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. (స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన వస్తువులు తెచ్చుకొంటారు.




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**


నాయనమ్మా! నీవు చిన్నప్పుడు చూసిన సినిమా కథ ఏదైనా చెప్పవూ! నీకు జ్ఞాపకం ఉంటుంది!!
(రచయిత్రి)
Muralidhar


చిన్ననాటినుంచో సినిమాల్లో వేయాలనుండేది! మంత్రినయ్యాక పది డాక్యుమెంటరీల్లో వేశాను!!

# సంతోషమే సగము బలము




ఆగండి
మీరు జీవితముపై విరక్తి చెంది ఆత్మహత్య చేసుకుంటున్నారా? అయితే దయచేసి మీ వస్త్రములు యీ డబ్బాలో పడేసి- చేసుకోండి. ఇట్లు - ఒక నిరుద్యోగి
రాగతి పండరి

